## —: తా రా లో క ము :—

### పు రు షు లు

తాన్ సేన్—కథానాయకుడు

అక్బర్—మొగలాయినేత

విద్యానందుడు—తాన్ సేన్ గురువు

మకరందపాండే— ,, ,, తండ్రి

బీర్ బల్—పాదుషా ప్రధానామాత్యుడు

హరిదాసస్వామి—యోగిపుంగవుడు

ఆ. గా—ఆస్థానగాయకుడు

### స్త్రీ లు

తాన్సీ—కథానాయకురాలు

దిలేరా—అక్బర్ కుమార్తె

రమాదేవి—తాన్ సేన్ తల్లి

విజయ—నాట్యకర్తె



# వినువీధి

## (శుక్ల పక్షము)

### ఖండకావ్యము

రచయిత:- శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు

...... తెలుగు దేశాన్నేకాక యావద్భారత దేశాన్నికలచి కలవర పెట్టే అనేక సమస్యలను ఆధారంగా తీసుకొని రచింపబడిన ఖండ కావ్య సంపుటియే యీ వినువీధి.

...... తేట తెలుగు మాటల్ని ముద్దుగా మూటగట్టే పద్యాలు. చదవ గానే మీరు తన్మయులవుతారు. ఇదే యీకావ్యంలో వుండే విశిష్టత.

...... హంపీ శిధిలాలు—ఆంధ్రరాష్ట్రం, తెలుగు సంస్కృతి, ప్రకృతి పరిశీలన— అనేక వివిధ శీర్షికలతో, సర్వజనాకర్షణీయముగా తమ అమూల్యాభిప్రాయాలతో ఆదరణ చూపించారు.

...... మీరు కూడా ఈ వినువీధి కావ్యాన్ని చదివి మా సారస్వత కృషికి చేయూత నీయాలని మా అభికాంక్ష.

తెల్లని కాగితం, ముద్దుగొల్పే గెటప్. మూల్యం 1-0-0.

ముందుగా రూపాయి మనియార్డరు పంపినవారికే పంపబడును.

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు

సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమహేంద్రవరము.

# త్రాన్స్‌సేన్

## దృశ్యము ఒకటి

(విద్యానంద్ వీణ వాయించుచుండ, తెర యెత్తుదురు.)

వందే వందే భారతమాతా
వర్ణవిభేదము లెన్నోకతనరిన
అందరు పండితులు లోకశేవిధిగా
నిన్నే స్మరనచేయుదు రేలా
గౌరీనాధున్ హరి జలజాతున్
సమస్తజగతీనాధున్ మానీ॥

శమ :—ఏమండీ! అబ్బాయి యింకా రాలేదా ?

వి :—ఏమి అబ్బాయి అండి. ప్రాణాలు తీసివేస్తున్నాడు. ఊపిరితీసు కొంటే అనుకరణము. నెలకు ఇరవైరోజులు కనపడనే కనపడడు. కనపడ్డాడా, గొల్లుమని యేడిపిస్తాడు. అనుకరణములో రక్త ముడికిస్తాడు. నేను పాఠాలు చెప్పలేనండి.

రమ :—మేష్టారూ! మీరే అంత చికాకుపడితే ఎల్లాగండి? కుఱ్ఱ వాడు కనుక వెంకితనముచేస్తాడు. చూసీ చూడనట్టు వదలి వెయ్యాలి.

వి :—ఆ మాత్రము నాకు తెలియదు. నాకు మాత్రము పిల్లలులేరూ కొంత నయాన్ని, భయాన్ని బెదిరిస్తే కాని, లాభములేదు. మొక్కై వంగనిది మ్రానై వంగుతుందా ?

రమ :—తాసీ !

(తెరలో వస్తున్నా అని తాన్ సేన్ ప్రవేశించును.)

విద్యా :—చూశారా, ఆ సమాధానములో ఎంత అనుకరణముందో ! ఇల్లాంటి పెంకితలకాయకు విద్య నేర్పటముకంటె రెండువీధులు ముష్టియెత్తుకొంటె మంచిది.

భయము, భక్తియు లేనట్టి బండకుంక
జేర్చి. బోధించి ధనమును జేర్చుకంటె
బిచ్చమెత్తుట మేలు, లభించు భుక్తి
యుడికిపోదు మనంబు హాస్యోక్తి వినుట.

రమ :—(కోపముతో) తాసీ ! నీకు బుద్ధిలేదూ ? ఇతరుల వెగతాళి చేయవద్దని యెన్నిసార్లు చెప్పాను ?

తాన్ :—చాలాసార్లు చెప్పావు. నేను లేదన్నానా ?

(గురువునకు సాష్టాంగనమస్కారముచేసి) నమస్తే !

విద్య :—నమస్తే అనవద్దని నీ కెన్నిసార్లు చెప్పాలి ?

తాన్ :—ఆ మాట మానిందాకా !

రమ :—(కోపముతో) నోరు ముయ్యి. గురువుగారు భగవంతునితో సములని యెన్ని చెప్పాను ?

తాన్ :—గురువుగారే ఆ గౌరవము నిలబెట్టుకో లేకపోతున్నారు. గురువుగారే సాక్షాత్పరబ్రహ్మ అయితే నా గొడవ తన కెందుకు ? మన కృష్ణు డేమన్నా కలగజేసికొంటున్నాడా ? తనకు పెట్టిన వెన్నను తాజేసినా మాట్లాడుతున్నాడా ? నే నెంత అల్లరిచేసినా బెత్తము చూపిస్తాడా ? ఈ గురువుగా రెంత గందరగోళ మెందుకు చేస్తారు ! చితకకొట్టి పైగా మాతో ఫిర్యాదు చేస్తారు.

విద్యా :—విన్నారా ? ఆ కొంటెతనము ! ఆ సమాధానము ! ఇల్లాంటి వాళ్ళా బాగుపడేది ! ఎంతప్రయత్నముచేసినా కుక్క గోవవుతుందా ?

రమ :—అయినా, ప్రయత్నము చేయాలికదండీ !

వి :—తల్లి తన కుమారుణ్ణి హిమాలయపర్వతశిఖరముమీద కూర్చోపెట్టాలని కోరుతుంది కాని, సాధ్యమవుతుందా ? భగవంతుని సృష్టిలోనే విభేదాలున్నాయి. కాని ఎంత ప్రయత్నించినా కాకి కోకిల కాలేదు.

తాన్ :—అమ్మా ! నేను కాకినా, కోకిలనా ?

వి :—(కోపముతో) కాకి ! కాకి ! కాకి ! ముమ్మాటికి కాకి !

తాన్ :— కాకిగురువు కాకే కదూ ?

(తల్లి బెత్తము చూపించి) ఇదేమిటో తెలియునా !

తాన్ :—బెత్తము.

ర :-- ఎందుకు తెచ్చానో తెలుసునా !

తాన్ :— కొట్టడానికి.

ర :—ఎవరిని ?

తాన్ :—గురువుగారిని.

ర :—నోరుమూస్తావా, మూయవా అనవసరపు ప్రసంగము చేయక కూర్చో.

(తాన్ సేన్ నోరు మూసికొని కూర్చుండును.)

వి : —పాఠము చదువు !

తా :—(చదవ నని సంజ్ఞచేయును.)

వి :—చదువు !

తా :—(తల్లివైపు చూపును)

వి :—చూసారా ! అమ్మా, యెంత పెంకితనమో !

తా :—అమ్మా ! లోకువని మీ రిద్దరు నన్ను చంపేస్తున్నారు. నోరు మూసికొని కూర్చో అని నీవు బెత్తము చూపిస్తావు. చదువు అని ఆయన పీకుకొని తింటారు. మధ్య చావు నాకు వచ్చింది. (అని యేడ్చును.)

ర :—ఓరీ రాక్షసీ !

తా :—అమ్మ ! యేదో ఒకమాట చెప్పవే ! స్పష్టముగా చెప్పవే ! రాక్షసా, భగవంతుడా !

ర :—ఎవరు ?

తా :—గురువుగారు.

వి :— (కోపముతో) ఇల్లాంటివాళ్ళకు విద్య చెప్పటం నా తరము కాదు నా జీతమురాళ్ళు నాకు పార వేస్తే నేను పోతాను.

ర :—గురువుగారూ ! కుఱ్ఱవాడు తెలివితేటల కలవాడు. మీరు శ్రమ పడి పైకి తీసికొనివస్తే మంచిపేరు వస్తుంది.

వి :—అమ్మా ! మమకారముతో పొంగిపోయే మాతృహృదయ లోంచి బయలుదేరే ఆశాతరంగాలకు అంతములేదు. కాని, యీ కుఱ్ఱవాణ్ణి బాగుచేయటము నా తరముకాదు.

ర :—గురువుగారూ ! నమస్కారము చేస్తాను. మీ పుత్రుడే అను కొని చదువు చెప్పండి. ఈ ఉపకారము మరచిపోము.

జనని యొసగినబొమ్మను సంస్కరించి
ప్రాణమును బోసి, శాస్త్రాల ప్రజ్ఞనొసిగి
జ్ఞానచక్షువు నిచ్చి విశ్వాధినాథు
జూపువారలె గురువులు స్తుత్యులెపుడు.

వి :—క్షమించండి. ఆ శక్తి నాకు లేదు. కాకిని కోకిలగా మార్చే పటుత్వము నాకు భగవంతు డివ్వలేదు.

తా :—అమ్మా ! అనవసరముగా ఎందుకు చంపుతావే ? ఆయన నిజమే చెప్పుతున్నారు. ఆయన కా శక్తి లేదు. కాని, కోకిలను మాత్రము కాకిగా మార్చగలరు.

ర :—నోరు ముయ్యి ! గురువుగారూ, ఏమంటారు ?

తాన్ :— గురువుగారూ ! ఖచ్చితంగా చెప్పండి. సంగీతములో కుస్తీ పట్టి మీరు శ్రమపడి ఇతరులకు శ్రమ ఇవ్వటము మాని ఇంకొకవృత్తిలో ప్రవేశిస్తున్నామని.

వి :—విన్నారా, ఆ బిగింపుమాటలు !

తాన్ :—సృష్టిస్తే అమరగానము సృష్టించాలి లేకపోతే, ఉదరపోషణార్థ మనేక మార్గాలున్నాయి. అంతేకదూ గురువుగారూ !

వి :—విన్నారా, అబ్బాయి తెలివితేటలు ! ఇంక గురువు లెందుకు ! విద్య యెందుకు ! (అని వెడలిపోవును)

ర :—(కఱ్ఱతో కొట్టూ) అంతా తగలవేశావు వెధవా !

తా :—(ఆపుకొంటూ) మంచికి రోజులు కావు. నిజము చెప్తే భరించలేదీ పాడులోకము. వీణకు కంఠానికి సంబంధము లేనప్పుడు సంగీతపు పాఠా లెందుకో ? అర్హత లేదంటే ఆగ్రహ మెందుకు!

ర :—సంగీతవిద్వాంసుల సారము గ్రహించేఅంత పటుత్వ ముందన్నమాట ! నోరు ముయ్యి.

(ఇంతలో మకరందపాండే ప్రవేశించును.)

మక :—ఇదేమిటి ?

ర : —ఏమీ లేదు. మీ స్వంతపుత్రుడు గురువుగారికి స్వస్తి చెప్పాడు.

వీణ పల్కించు రవములు వేఱు, గురువు
కంఠమున బల్కు నాదంబు కలియ దెచట.
చెవులు కలవారి కెంతయో సిగ్గుచేటు
వలదు నా కని పంపె మీ స్వచ్ఛసుతుడు.

తా :—(ఏడుస్తూ) మాష్టారుకు జీతము చాలదని యేదో వంకపెట్టి వెళ్ళిపోయారు. నాదే తప్పని అమ్మ కోపము పట్టలేక నన్ను కొట్టింది.

మ :—ఎందుకు కొట్టావు ?

ర :—ఆ సత్యమూర్తినే ప్రశ్నించండి. గురు స్సాక్షాత్ పరబ్రహ్మ అన్నదానికి నూత్నభాష్యము చెప్పాడు విని ఆనందించండి.

విష్ణుచెంత నిడిన వివిధభక్ష్యంబుల
దినిన గంతులిడిన, దిట్టుచున్న
కృష్ణు డూరకుండు, గేలిగావించిన
గురువు లేల బొందు కోప మమ్మ ?

అని చెప్పాడు.

మ :—కుఱ్ఱవాణ్ణి కొట్టవద్దని చెప్పలేదూ ? ఎందుకు కొట్టావు ?

ర :—ఆ సత్యమూర్తినే అడగండి.

తా :—నే నెందుకు చెప్తాను, కొట్టింది అమ్మేకదూ !

మ :—ఎవరు చెప్పక్కరలేదు. అంతా అర్థమైంది పంతులుగారు అభినవ దూర్వాసులు. తల్లి కుఱ్ఱవాణ్ణి అర్థముచేసికోలేని మూర్ఖురాలు. సామాన్యులను ఉడికించి యేడ్పించే మేధ కలవాడు తానీ ! (ఆలోచించి) తానీ ! నీకు చదు వంటదు. పోయి, మామిడితోట కాపాడు. పెద్దపులిలాగు అరచి, పాంథులను బెదిరించు. తెలిసిందా,

తా :— కాని, అమ్మ— (తల్లివైపు చూచును)

ర :—తండ్రి ప్రోత్సాహ మిస్తుంటే కుఱ్ఱవాడు బాగుపడతాడా ! వెళ్లు నిర్భాగ్యుణ్ణి బాగుచేసేవా డెవడు ?

తా :—నిర్భాగ్యుణ్ణి బాగుచేసే వా డెవడు ? (అని అనుకరించుచు వెల్లపోవును.)

ర :—మంచిపని చేశారు. ఇప్పటికైనా కళ్ళు చల్లబడ్డాయా!

మ :—రమా! నీవు మూర్ఖురాలవు. తాన్సేను తత్వము నీ కర్థము కాదు. అజ్ఞానాంధకారాలతో బాధపడి గొల్లుమని యేడ్చే మానవసంఘాన్ని తన మధురకంఠముతో నవ్వించటానికి వచ్చిన అమరజ్యోతి మన తాన్సేను. అతని మార్గము నీ కర్థముకాదు. దూరముగా ఉండి భక్తితో రక్షించు. ఎంత స్వల్పకాలములో అత డత్యోన్నతస్థాన మాక్రమిస్తాడో గమనించు.

ర :—(నిరాశతో) సంపూర్ణముగా మెదడు క్రుళ్ళిపోయింది. ఈ పిచ్చి వాని పెంపకములో తాన్సీ పిచ్చివా డవటములో ఆశ్చర్య మేమీ లేదు. కాని నే నేమి చేయగలను! ఎవరి ప్రారబ్ధము వాళ్ళది. ఇంతకు ఇటువంటి పిచ్చివాళ్ళ కుటుంబములో పడ టము నా ప్రారబ్ధము.

(తెర వ్రాలును.)

△

# తాన్‌సేన్

## దృశ్యము రెండు

రామనామ సంకీర్తనము చేయుచు హరిదాసస్వామి,
అతని శిష్యులు ప్రవేశించెదరు.
(స్థలము—మామిడితోట)

పరమశివా దయ గనవా . ...॥ప॥
దయగనవా దేవ దేవ... ... ...॥ప॥
హే అభవా ననుగనవా, బ్రోవ రావా జాలి లేదా॥

శిష్యుడు :—గురువుగారూ ! పెద్దపులి !

యోగి :—(నవ్వుతూ) భయము లేదు నాయనా ! అది పెద్దపులి కాదు. కొంటెకుఱ్ఱవాని గందరగోళము, ప్రజలను భయపెట్టాలని పెద్ద పులి అయినాడు.

శి :—మీకు మతిపోయిందా ! అంత భయంకరమైన ధ్వని కుఱ్ఱవాడు చేస్తాడా ! చేయగలడా ! "వినాశకాలే విపరీతబుద్ధిః" క్షమించండి, సెలవు. బ్రతికిఉంటే పునర్దర్శనభాగ్యము.

యో :—భయపడవలసిన అవసరము లేదు నాయనా !

శి :—కావాలని నేను పెద్దపులి నోటిలో పడి ప్రాణాలు వదలలేను. అన్నీ ఉడిగిన మీకు, ఇప్పుడే యౌవన మంకురించిన నాకు భేదముంది. (అని పారిపోవును.)

(తాన్‌సేన్ వచ్చి తాతగారూ ! పారిపోరే ! పెద్దపులి–పెద్దపులి !
గాండ్రు గాండ్రని కబళింప కనుల నిప్పు
లొల్క శార్దూల మరుదెంచు నొక్క సాప

మాలసించిన గలిళించనయ్య మిమ్ము,
పారిపొందు పొం డిదె వచ్చి పడెడు మీర.

యో :—భయము లేదు, నన్ను మ్రింగే అంత పెద్దపులి కా దది.

తా :—అంటే —

యో :—ఆ పెద్దపులికి తోక లేదు. రెండే కాళ్లున్నాయి. ఇంకా చెప్పనా ?

తా :—చెప్పండి.

యో :—అది మామిడిచెట్టుమీద కూర్చొని, అందరిని బెదిరిస్తుంది. అన్నము తింటుంది. అది విచిత్రశార్దూలము.

తా :—తాతగారూ ! విచిత్రముగా మాట్లాడుతున్నారే ! తోకలేని పెద్దపులులు, తోక ఉన్న మనుష్యులు ఉంటారా ! మీరు చూచారా ?

యో :— చూచాను. ఎందుకు చూడలేదు. ఇప్పుడే చూచాను.

తా :—ఎక్కడ ?

యో :—అదుగో ఆ మామిడిచెట్టుమీద.

తా :—ఎక్కడ ? నాకు కనబడటములేదే.

యో :—ఇపుడా చెట్టు దిగి వెళ్లిపోయింది.

తా :—ఎక్కడకు ?

యో :—ఇక్కడకు ఇదుగో, (అని తాన్‌సేను వీపు తట్టి) నాయనా! కంఠములో గాంభీర్యము, మాధుర్యము, మార్దవములున్నాయి పాతాళలోకములో కాలసర్పాలమీద నృత్యముచేస్తు మానవ లోకములో చరచర ప్రకృతిరహస్యాలను వెలిబుచ్చుతూ, ఆకాశగంగలో మునుకలొంది దేవతాకన్యకలతో రాసక్రీడ లాడే నేర్పు నీ కంఠాని కుంది ; కాని, గురుశుశ్రూష లేకపోవ టమువలన మా వంటివానిని బెదిరించలేకపోయింది.

తా :—మీ రెందుకు పారిపోలే దని.

యో :—నేను మొదటనే చెప్పానుకదా! పెద్దపులిగర్జనకు నీ కంఠా
నికి భేదముందని. ఆ భేదము సామాన్యకర్ణాలు గమనించ లే
నంత సూక్ష్మమైనది. ఆ భేదాన్ని గమనించటము కష్టమే.

భయద జీమూత బంధిత స్వర్గసీమ
చంద్రకాంతుల మోదించు చతురు డొకడు
సూక్ష్మతమ రాన భేదముల్ చూచి మెచ్చి
యనుభవించెడివాడు ధన్యాత్ము లెపుడు.

తా :—ఆ తేడాకూడా లేకుండా చేసేమార్గము లేదా!

యో :—లేకేమి! కాని, సద్గురుకటాక్షము లేందే అది లభ్యము
కాదు.

తా :—ఆ సద్గురు వెక్కడ లభిస్తాడు?

యో :—లభిస్తాడు కాని, అతనికి శుశ్రూష చేసి, అతని మనస్సును
రంజింపజేసి అతని హృదయములో రహస్యముగా దాగిఉన్న
ప్రేమ ననుభవిస్తు విద్య నేర్వటము కష్టము.

తమ్మి దేవి శయనించి, సౌఖ్యముల్ విడనాడి
బ్రహ్మచర్యము పూనవలయు మొదట
చోరుడై హృదయంబు సొచ్చి సద్గురు సేవ
మమకారమున దాన మసలవలయు
పశ్యతోహరు డంచు ప్రథితుడై విజ్ఞాన
విత్తంబు చేకూర్చి వెలయవలయు
సాహిత్యసుధి గ్రోలి జగదీశుపదముల
విశ్వంబె మరచి సేవింపవలయు
గ్రామగ్రామంబు తిరిగి భిక్షన్న మెటులో
కష్టమున జేర్చి, గురుచెంత కాన్క లిడుచు

నతని దయ గోరి దీనుడై యనుదినంబు
నిల్వవలయును, సాధ్యంబె నీకు తనయ.

తా :—ఎన్నికష్టా లున్నా అనుభవించి. గురుశుశ్రూష చేసి అతని మనస్సు హరించగలను.

భూమిదేవి శయనించి సాధింతు శాంతంబు
పవనూను సేవించి జవము నేర్తు
కంధిని బూజించి గణియింతు రత్నాల
సేకరించెడి నేర్పు శిక్ష బొంది
హవ్యవాహను గూర్చి యమరత్వ మొందెద
లోకత్రయంబుల లోతు నెఱిగి
కంధరార్చన జేసి కనలేని యౌన్నత్య
మొందెద బందుగులే మోదమొంద

గురుని సత్కృప గల్గిన గౌరత కలదె!
పంచభూతంబు లెప్పుడు బంటులగును
విశ్వనాథుని సత్కృప వెంట బడును
భయము నా కేల మీ వంటివారు కల్గ!

మో :—శుశ్రూష చేయటానికి - నాయనా, అతికోమలమైన నీ ఈ లేత శరీరము శుశ్రూష చేయటాని కర్హమైంది కాదు. ఆ శుశ్రూషలో శ్రమలు చాల ఉన్నాయి.

తా :—ఎన్ని కష్టా లనుభవించి యైనా సంగీతవిద్య నభ్యసిస్తాను.

మో :—సంతోషము కాని, మీ తల్లిదండ్రు లంగీకరించకపోతే.

తా :—నాకు తల్లిదండ్రులు లేరు. మీరే నాకు సర్వస్వము.

పితరు లిచ్చిన దేహంబు విలయమొందు
గురువు లిచ్చిన దేహంబు తరగ దెపుడు

దిన దినంబును బెంపొంది తేజరిల్లు
కాన, తల్లిదండ్రులు మీరె మీ కరుణ వలయు.

(అని పాదములు వ్రాలును.)

యో :—(నవ్వుచు) తాన్‌సేను, ధన్యుడవు! మీ తల్లిదండ్రులకు నచ్చజెప్పి నిన్ను వెంటగొని పోయెదను.

(శిష్యుడు ప్రవేశించును. మరల తాన్‌సేను పెద్దపులివలె గర్జించును. శిష్యుడు బెదిరి క్రిందపడి బాబోయి, పెద్దపులి! (కనులు మూసికొనును)

యో :—(వీపుతట్టి) భయము లేదు. కళ్ళు విప్పు.

(శిష్యుడు యోగిని కౌగలించుకొని) బాబోయి పులి-పెద్దపులి! రక్షించండి గురూజీ!

యో :—తాన్‌సేన్ చూశావా, సామాన్యు లెంత బెదురుతారో?

శి :—(కన్నులు తెరచి ఆశ్చర్యముతో తాన్‌సేనును చూచి) నీవురా హడలిగొట్టి చంపేశావు!

యో :—తాన్‌సేన్ పోవుదమా!

దుర్గీశ్వరా నను బ్రోవగ రారా ॥దు॥
గంగాధరా యమసాధితాత్మకా ॥దు॥
కరివరదుడ వని కనుల ధరించిన
జలముల నిను నే శరణు జొచ్చితిని
కనికర మొందుమ పురహర! శంకర!
తవపదార్పనము చేసె నెపుడున్ ॥దుర్గీ॥

(తెర వ్రాలును.)

△

# తాన్ సేన్

## దృశ్యము మూడు

(ఆస్థాన గాయకులు జంత్రములపై గానము చేయుచుండ అక్బరు)
సింహాసనాసీనుడై యుండ తెర యెత్తుదురు.)

అక్బరు :—బీర్‌బల్ ! తాన్‌సేను జగద్విఖ్యాతి వహించిన గాయకుడు. సార్వభౌముల యాస్థానములలో నివసింప వలసిన గాయకుడు.

బీర :—నిస్సందేహముగా ! తమ ఆస్థానానికి రప్పించటానికి అనేక ప్రయత్నాలు చేశాను కాని, లాభము లేకపోయింది. అతడొక విచిత్రవ్యక్తి.

అ :—ఆతని కంఠములో అమృతముంది. విన్నవాళ్ళు వదలలేనంత ఆకర్షణ ఉంది. ఆతని వ్యక్తిత్వములో అహంకారము, ఆత్మ గౌరవము హృద్యముగా సమ్మిళితమైనాయి. అటువంటి గాయకుడే మన ఆస్థానములో ఉంటే—

బీర :—ప్రభువు చెప్పింది నిజమే కాని, ఆ వాంఛ గగన కుసుమము.

అ :—(నిరాశను సూచించే నిట్టూర్పు వదలి) సరే యేమి చేస్తాము ! తాన్‌సేనును పిలిపించు.

(తాళీ వచ్చి నృత్యము చేయును)

చంద్రబింబమైనా చంద్రకాంతనైనా
ఈనాడె అనుభవించవోయి
రేపు చూతమనరేపటికి
పూయవు దివికనవు

చంద్రు వెన్నెల పువ్వులతీవేవోయి
సువాసనల్ వెన్నలలో సుఖించవోయి॥

అ :—(తన కంఠములోని ముత్యాలహారాన్ని తీసి) తానీ అత్యద్భుత ముగా నృత్యముచేశావు. ఈ పారితోషికాన్ని స్వీకరించు.

(తాన్‌సేన్ ప్రవేశించి) అక్బరుసార్వభౌమా! ఇది నాట్యమా! అక్బ రుసార్వభౌముని పారితోషికము నొందదగిన నృత్యమా! ముక్తాహారము కంఠసీమ నాట్యమాడి సార్వభౌముని సంస్తుతిని నిరంతరము ప్రజలకు జ్ఞప్తికిదెచ్చి లోకమును మోహింపజేయ ననువగు నాట్యమా! లలితకళలలో నింత యమాయకత్వమును సూచించు నరపాలుడు సింహాసనముపై నుపవిష్టుడయ్యెనా!

బీర :—వీ రక్బరుసార్వభౌములు.

తాన్ :—తమ రెవరు? బీరబల్ సార్వభౌములా! ఈమె యెవరు?

బీ :—తానీ.

తాన్ :—తానీ! నృత్యశాస్త్రమునం దపారపాండిత్యమును సంపాదించి ముక్తాహారముల నొందుచున్న విదుషీమణి "తానీ" అట—తానీ

తానీ :—ప్రభూ!

తాన్ :—తానీ! నీ వెంతద్రోహము చెస్తున్నావో నీ కర్థమైందా? భగవంతుడు నీ కిచ్చిన లలితకళకు సంపూర్ణవికాస మివ్వకుండ దాని యభివృద్ధిని గర్వముతో దునిమి, పాదుషా కళ్ళలో శారము కొట్టి చౌకరకము నృత్యముతో ఉదరపోషణత్వము సాగిస్తున్నావు, ఇది లలితకళలను ఖూనీచేయటముకాదా?
భగవంతుం డిడినట్టి శక్తులను గర్వంబొంది గ్రుంగిందేని సూరిగణం బబ్బుర మొంద నాట్యమున దారిన్ మార్చి విత్తార్థమై
జగతిన్ మోసముచేసే సత్కళల నీ స్వామ్యాట్టు వీక్షింపగా
తగలంబెట్టెద వింతసాహసము విద్యారాధికుల్ సైతురే.

తానీ :—(భయపడుతూ) తమరు చెప్పేది నాకర్థము కావటములేదు

తాన్ :—(గంభీరభావముతో) నేను చెప్పేది స్పష్టముగా విను. ఈ అక్బరుసార్వభౌముని ఆస్థానములో లలితకళలను ఆరాధించే నీవు సరస్వతీ సత్కృపవలన కళలలో అభినివేశము కల నీవు గర్వముతో లయను ఖూనీచేస్తున్నావు. శాసనాలు మాంతకు రాలైన నిన్ను రక్షిస్తున్నాయి. ప్రపంచాన్ని తన కఠోరశాసనాలతో కంపింపచేస్తూ పాపపుచ్ఛాయయైనా తన రాజ్యములో ప్రవేశింపనీయని అక్బరుసార్వభౌముడు నీ మాత్యాకాండానికి సంతోషించి పారితోషిక మిస్తున్నాడు. ఇంతకంటె ద్రోహమేముంది ?

తానీ :—నే నేమి చేశాను ?

తాన్ :—ఏమీ చేయలేదా ? ఎడమకాలికి కట్టిన మువ్వలను లెక్కించు, నీ కర్థమౌతుంది. ఒకకాలికి ముప్పది, ఇంకొకకాలికి ముప్పదిరెండు లేవా ! ధ్వనిలో ఎంతభేదము వస్తోందో గ్రహించలేవా ! ఇంత నిర్లక్ష్యముగా నృత్యముచేయటము లలితకళలను ఖూనీచేయటముకాదా !

తానీ :—ఇది నిజమేనా ! తమ కెల్లాగ తెలిసింది ?

తాన్ :—చెవు లున్నవారికి తెలుస్తుంది, లెక్కబెట్టు.

అక్బ :—తమ రెవరు ?

తాన్ :—లలితకళలను ఆరాధించే పూజారిని. గురుకటాక్షమువలన లభించిన లలితకళలను రక్షించి పోషించే యోధుడను.

బీర :—తమరు ?—

తాన్ :—ఔను. నేను తాన్‌సేనునే కాని, ఆ సంచర్భములో రాలేదు. శ్రీఅక్బరు ఆస్థానములో స్వర్గలోకమునుండి అప్సరస వచ్చి నృత్యము చేస్తుంది. ప్రతిపదవిన్యాసములోను అమృతము వర్షి

స్తుంది అంటే, కుచిచూడటానికి వచ్చాను. కాని, చూచిం దేమిటి? (తాసీవైపే చూచి) తాసీ! దీన్నే నా నృత్యమంటారు

మువ్వలు కదలింప ముజ్జగంబులు వచ్చి
దాసోహ మనునంచు తలచినాడ
మద్దెల మ్రోగింప మదనారి నటరాజు
తల వంచి చను నంచు తలచినాడ
భ్రూభంగమును గాంచి మోహించి పురవైరి
స్థాణు వే నని చూడ దలచినాడ
పాదవిన్యాసంబు పరికించి దేవతల్
భూమి నిచ్చెదరంచు పొంగినాడ
అనుపమభావాల ననుసరించి చరించు
తనుకాంతి వీక్షింప దలచినాడ
ప్రకృతిగుండెల దర్శిస్తు పల్కెంచు మర్మముల్
వారభామిని యంచు వచ్చినాడ
కాని, విన్నది కను నీచ గాన మబల
దీనినే నృత్య మందురా తెల్పనీడి
పండితులు, గాయకోత్తముల్ భళిర యంచు
మెచ్చుచుండిరె దీని భూమీశు నెదుట.

(తాసీ సిగ్గుతో తల వంచుకొనును.)

తాన్ :—తాసీ ఆ మృదంగము వాయించే పెద్దమనిషి వేళ్ళు పరిక్షిం చావా? కట్టువేళ్ళు పెట్టుకొని కదాం త్రొక్కుస్తున్నాడు. అదైనా గ్రహించావా?

తాసీ :—ప్రభూ, క్షమించండి! తమ రపూర్వములై, అనూహ్యము లైన సూక్ష్మరహస్యాలను పైకి లాగుతున్నారు.

అక్బ :—శ్రీ తాన్ సేన్ తమరేనా! తమ ఖ్యాతితో ఈ ప్రపంచము ప్రజ్వరిల్లుతోంది.

తాన్ :—అక్బరుసార్వభౌమా! నా దొక మనవి. క్షమించి, లలిత కళల సమాధిని మీ హస్తాలతో నిర్మింపవద్దు. ఇటువంటి యువతులను సత్కరించి మీ యజ్ఞానాన్ని లోకానికి సూచిస్తూ హత్యాకాండాన్ని ప్రోత్సహించవద్దు. ఇది నా ప్రార్థన!

ధరణీనాయక! సార్వభౌముడవు; విద్యారాధికుల్ మూర్ఖులై
గురుదేవుం డడు దివ్యసత్కళల నీకుం గాన్కగా జేసి, చే
యరు యత్నంబులు దాని పెంపు గన గ్రవ్యం బొక్కటే కోరుటల్
ధరణీనాయక! మాను, కోవిదుల విత్తంబిచ్చి పూజించుటల్.

బీర్ :—వారికి శక్తి ఉన్నంతవఱకు పండితులనే సత్కరిస్తూ, లలిత కళలకు ప్రోత్సాహ మిస్తున్నారు.

తాన్ :—సార్వభౌమా! తమ సత్కారములు పండితుల విజ్ఞానాన్ని పెంపొందజేయలేకపోయినపు డా సత్కారాలు వారిలో పాపాన్ని ప్రవేశపెట్టటములేదా!

అక్బ :—మీ వంటి లలితకళోపాసకులీ ఆస్థానాన్ని ఆక్రమిస్తే లలిత కళాగ్రేసరుల నారాధించే యదృష్టము మాకు పడుతుంది.

తాన్ :—అక్బరుసార్వభౌమా! క్షమించండి, రాజదర్బారులో లలిత కళలు స్వేచ్ఛగా సంచరించలేవు, కఠోరశాసనాలకు క్రుంగిపోయి, క్రమశః క్షీణించి నశిస్తుంది. సార్వభౌములాత్మ ప్రశంసలో ఆనందమనుభవిస్తారు. అతిశయోక్తులసంఖ్య యధికమైన కొలది ఆనందముతో పరవళ్ళు త్రొక్కుతారు. కాని, లలిత కళ సత్యదేవత నారాధిస్తూ నగ్నస్వరూపముతో దాన్ని ప్రకటిస్తుంది. ఆ సత్యము భూపాలురకు – రాజనీతితో జీవించే

భూపాలురకు కంటకముగా ఉంటుంది. ప్రభువులు తమ ఇష్టము వచ్చినపుడు దేశ, కాల, పాత్రాదులను ఆలోచించకుండానే కళారాధికులను శాసిస్తారు. లలితకళ ఆ నిరంకుశత్వాన్ని సహించదు. దానికి స్వేచ్ఛ కావాలి. ప్రభువులు దాన్ని హరిస్తారు. కనుక, లలితకళలు రాజదర్బారులో జీవించలేవు.

బీర్ :—తమ స్వాతంత్ర్యములో జోక్యము కలుగజేసికోనకపోతే.

అక్బ :—అక్బరుపాదుషా తమ ఆజ్ఞలను శిరసా వహించి తను కింకరుడైతే—

తాసీ :—(ఆశను సూచించే ధ్వనితో) ఏ శిష్యురాలైనా సర్వ మర్పించి మీ పదకమలాలను సేవిస్తూ, కళోపాసన చేయాలని ఆశిస్తే—

తాన్ :—అప్పుడు తాన్‌సేను అక్బరుఆస్థానాన్ని అలంకరిస్తాడు. కాని పాదుషావా రొకటి జ్ఞాపకముంచుకోవాలి. తమరీ విశ్వాన్ని తమ కఠోరశాసనాలతో శాసిస్తూ, ఆ బాధను మరచే అంత అమృతాన్ని వెదజల్లుతూ మానవహృదయములో స్థిరనివాస మేర్పరచుకొని పూజలను పొందుతున్నారు. కాని, కళాప్రపంచములో మీ శాసనా లనువర్తించవని మరచిపోరాదు. తమరు తాన్‌సేనును శాసించాలని యత్నించిననాడు అతడు పరారై పోతాడు,

అక్బ :—హృదయపూర్వకముగా తమ ఆధిక్యతను స్వీకరించి, తమని నారాధిస్తాను.

బీర్ :—తమరు కళాప్రపంచకానికి సార్వభౌము లవటమువలన సమానపాయిదాలో తమరిని గౌరవిస్తారు.

తాన్ :—ఇంకొకమాట! తమ రిచ్చే వేతనము తాన్‌సేను భుక్తికి కాదని, సరస్వతీ పాదకమలాలుచెంత తమ రర్పించే కాను-

లని, అందుచేత తాన్‌సేను ప్రతిదినము తమ దర్శనార్థము రావలసిన యవసరములేదని తమరు జ్ఞాపకముంచుకోవాలి.

అక్బ :—అధికమేధావులకు సంఘ మిచ్చే గౌరవమే. దాన్ని తమరు తిరిగి శాసింపవలసిన యవసరములేదు.

తానీ :— తన యిష్టమువచ్చినపుడు ప్రభుదర్శనము చేసికొని వెళ్ళిపోతాడు; అతని గమనాగమనాలను శాసించే నియమముండకూడదు.

బీర్ :—ఇది క్రొత్తవిషయము కాదు. అధికమేధావికి ప్రకృతి యిచ్చిన హక్కే అది. అవసరమైతే ప్రభువులే వచ్చి, తమ దర్శనము చేసికొంటారు.

తాన్ !—ఆ దర్శనముకూడా లభించకపోతే విశ్వాసఘాతకుడని నిందించకూడదు—తానీ! నీవు నీ యధికారాన్ని, అహంకారాన్ని నిర్మూలించుకొని భారతీదేవిపూజకు సమ్మతిస్తావా?

తానీ :— మహాభాగ్యము!

అక్బ :— తమ రీ సింహాసనాన్ని అలంకరించండి! (అని రత్నమాల నర్పిస్తాడు.)

ఆస్థానగాయకుడు :— ప్రభూ, మనవి!

అక్బ :– (గాయకుని నిరీక్షించును)

ఆ. గా :—ఆస్థాన ముత్తమగాయకుని ఆస్తి.

బీర్ :—తాన్‌సేను గాయకోత్తములు.

ఆ. గా :—ప్రభువులు తేల్చవలయును.

తాన్ :—గాయకోత్తమా! మనము సోదరులము. లలితకళలను రక్షించుయోధులము. ఆస్థాన మెవరాక్రమించినను సంతోషమే

ఆ. గా : --ప్రభువులచెంత పరీక్షయవసరము.

బీర్ :—గాయకోత్తమా! హంసకాకీయోపాఖ్యానము చదువలేదా!

అ. గా :—చదివితిని. అందులకే, కాకిని చూపింప బందెము వేయు చుంటిని.

అక్బ :—అయిన ప్రారంభింపుడు.

గే య ం.

ఆనందమే - ఆశించవే
మానసము రంజించునే!
జీవకళాశోభితమే ॥భువి॥
శ్రీయుతమే జీవనమే
చిన్మయమే స్థిరతరమే
సుందరమే శోభితమే ॥భువి॥
నగవులె జీవికి నగయగునె
నగలేనియెడ నగుబాటే
వగలకు నదియే ఆలయమే ॥భువి॥
ఆనందమే - ఆశించవే
మానసము రంజించునే!

(గాయకుడు వీణపై పాడును. ప్రక్క వాద్యము లనుసరించును తానీ భయముతో తాన్‌సేనువైపు చూచును)

తాన్ :—అక్బరుసార్వభౌమా! యంత్రముల నట నుంచి, యీ గాయకోత్తములను దూరముగ నుండ శాసింపుము; లేనిచో మానవ సంసర్గమున బ్రకృతి సహజకోమలత్వమును వీడి కర్కశారవముల వెదజల్లును.

అక్బ :—తమ యభిప్రాయము —

తాన్ :—మానవ కరస్పర్శచే కలుషితములుకాని యంత్రములు స్పదించి దివ్యగానమును వెలువరించును.

అక్బ :—అటులనే.

## తాన్సేను పాడును.

### గే య ం.

అన్వేషణము చేయవా!
ఆనందమును బొందవా!!
చీకు చింతలతోడ
జీవితము గ్రుంగగా
మాయ బ్రతు కిదియంచు
మమత నీడెదవా!

అన్వేషణము చేయవా!
ఆనందమును బొందవా!!
మురళీ రవాలకును
మోదంబు జెందవా?
ముద్దువీణియ మ్రోగ
మురిపెంబు నందవా?

అన్వేషణము చేయవా!
ఆనందమును బొంగవా!!
చెలవయ చూపులలోన
కలువకాంతులలోన
వెలుగు జ్యోతులలోన
వెన్నె విరులతో

అన్వేషణము చేయవా॥
ఆనందమును బొందవా!!
నెలబాలు కవితో
నెమలి నాట్యాలతో

కోకిలల కూతలతో
కులుకు పలుకులతో
అన్వేషణము చేయవా !
ఆనందమును బొందవా ! !

యంత్రములు స్పదించి యనుసరించును.

(తానీ యానందపరవశయై నృత్యముచేయును.)

(అక్బరు తాన్ సేను కంఠమున హారమును వేయును.)

తాన్ :—తానీ—

తానీ :—ప్రభూ ! ఆజ్ఞ !

తాన్ :—ఈ మాలను ధరించి, దీక్షను స్వీకరింపుము.

తానీ :—క్షమించండి. ఆ హారము తమ కంఠాన్ని ఆశ్రయించి, అధికముగా ప్రకాశిస్తుంది.

తాన్ :— ఇది గుర్వాజ్ఞ ! అనుల్లంఘ్యమైనది.

(తానీ ముందుకు వచ్చును.)

అక్బ :—తానీ ! అక్బరుసార్వభౌముని పారితోషికము నితరులు గ్రహింపగూడ దని నీకు తెలియదా !

తానీ :—ప్రభూ, క్షమించండి ! అజ్ఞానాంధకారములో ప్రాకులాడే నా కీభావము తట్టలేదు.

తాన్ :—కవి స్వతంత్రుడు. ఆతణ్ణి శాసించే నియంత లేడని నీకు తెలియదా ! తానీ ! బీరబల్ మహాశయా ! ఇదియా మీ సార్వభౌముని ప్రతిజ్ఞాపాలనము, ఒకక్షణముక్రింద ఇచ్చిన వాగ్దానాన్ని అత్యద్భుతమైన రాజనీతిని ప్రదర్శిస్తూ మాపించి, స్వాతంత్ర్యానికి పెనుగులాడే కళోపాసకుని సువర్ణపంజరములో బంధించి, నిద్రబుచ్చేగీత మాలాపించటము భారతీయులు సహించే లక్షణమా !

అక్బ :—మా అభిప్రాయము అది కాదు. ఈ మాల తమ కంఠాన్ని అలంకరించి, యీ దీనుణ్ణి సదా జ్ఞాపకముచేయాలని.

తాౕ :—ఉద్దేశము మంచిదే. ప్రతివ్యక్తి తన స్వాతంత్ర్యాన్ని రక్షించుకొంటాడు. అది వాని జన్మహక్కు. కళోపాసకుడీ నియమాలను, రాజమర్యాదలను పాటించలేడు ; సెలవు !

(అని ముక్తాహారమును నేల విసరును)

(తానీ దాన్ని తీసి, కన్నుల నద్దుకొని; ధరించును,)

తానీ : – ప్రభూ !

అక్బ :— తానీ !

తానీ :—ఆజ్ఞ !

అక్బ : —నీ వెవరిదర్బారులో నాట్యముచేస్తున్నావో తెలుసునా ?

తానీ :—తెలియకేమి ప్రభూ ! ఎవని శాసనాన్ని ధిక్కరించటానిక త్రినేత్రునికైనా సాహసముండదో, ఎవని విజ్ఞానముముందు హేమాహేమీలైన పండితులే కంపితగాత్రులై దాసోహ మంటారో ; ఎవని రాజనీతిముందు బ్రహ్మాండములైన రాజ్యాలన్నీ నేలమట్ట మవుతున్నాయో ఆ అక్బరుసార్వభౌముని అస్థానములో నాట్యముచేసేదాన్ని,

షేర్ :—అప్పటి నీ యభివృద్ధిని విస్మరించావా ?

తానీ :—పూర్వము నేను నా నాట్యకళను కడుపుకక్కుర్తికి అమ్ముకొని, లోకాన్ని చౌకరకము నృత్యముతో మోసగించేదాన్ని. లలితకళలను పెంపొందజేయవలసిన బాధ్యత నా మీద లేదనే నిర్లక్ష్యముతో సంచరిస్తూ, ధనదేవతను ఆరాధించేదాన్ని. అక్బరుసార్వభౌముని కరుణాకటాక్షవీక్షణాలకై ప్రాకులాడి, స్వాభిమానాన్ని, స్వాతంత్ర్యాన్ని చంపుకొని, నిర్గంధకుసుమానై జీవించేదాన్ని.

అక్బ :—(ఆగ్రహముతో) ఇప్పుడు ?

తానీ :—ఈ మహాత్ముడు వచ్చి నాకొక నూత్నప్రపంచము చూపించాడు. ఆ ప్రపంచములో ఆ సామ్రాజ్యములో ప్రతివ్యక్తి కళోపాసకుడై ఆనందముతో పరవళ్ళుత్రొక్కుతూ విహంగ జీవితాన్ని గడుపుతున్నాడు. అక్కడ శాసనాలు లేవు. సార్వభౌములు లేరు. ఉదరపోషణార్థము నైచ్యానికి తలయొగ్గవలసిన పరిస్థితులు లేవు. పేదల కుటీరాలను గర్హించే సౌధాలు కాని, దివ్యసౌధాలను ఈర్ష్యతో శపించే జీర్ణకుటీరాలుకాని లేవు. ఇప్పుడా ప్రపంచములో నేను ప్రవేశించాను.

తలకిరీటము దాల్చి దాస్యంబు పంచెడి
భూమిశు లుండని పుణ్యభూమి
లక్ష్మీకటాక్షంబు ప్రార్థించి సత్కవుల్
ప్రభుసేవ జేయని లలితభూమి
ఆకాశచుంబిత హర్మ్యాల దిలకించి
ఎట్టి శపింపని దివ్యభూమి
గానంబు, నృత్యంబు, కళలు, పాండిత్యంబు
కలహించి క్రమ్మని కర్మభూమి
కాంచుచుంటిని ప్రభువరా! కవులు నిరత
మూహ నిర్మించి ముదమొందు నుజ్జ్వలంపు
తలము, వెనుకటి దురవస్థ తలచి హృదయ
మెగిరిపోయెడు ఖగమట్లు గగనసీమ.

బీర్ :—ఈ ఉన్మత్తప్రలాపాలకు ఫలిత మూహించుకొన్నావా !

తానీ :—ఇదివరకు చేసిన ఘోరకృత్యాలకు ఫలితముగా దాస్యవిముక్తి. ప్రభువులను ధిక్కరించినందులకు కారాగృహనివాసము. అధునిక శాసనాలను తిరస్కరించి, ధిక్కరించినందులకు మృత్యువు,

నూత్నప్రపంచములో ప్రవేశించిన నా కివి అన్నీ ఆటవస్తువులే ; శిక్షలు కావు.

మూఢజనులను బెదరించి, గాఢమైన
తిమిరమున ద్రోయు శిక్షల భ్రమణ మొంది
చిత్త మా నూత్నలోకాల చెందనాడి
ధాన్యమును సేకరించును ! ధరణినాథ.

తాన్ :—రాజనీతియందు దసమాన ప్రజ్ఞ సంపాదించి, అమృత మని నమ్మించి విషము త్రాగించే అక్బరుసార్వభౌమా ! కళోపాసకులతో కలహము శాశ్వతావమానము ; జాగ్రత్త !

(అని తానీతో వెడలిపోవును.)

అక్బ :—(నిట్టూర్పు వదలి) అక్బరు ఆస్థానము—తానీ, తాన్‌సేనులు లేరు. నృత్య, సంగీతశాస్త్రాలు గ్రహించి పరారైనాయి.

బీర్ :—మళ్ళీ తాన్‌సేను వస్తాడనే నమ్మకము నా కుంది. పుష్పమకరందాన్ని రుచిచూచిన తుమ్మెద పుష్పాన్ని వదలి జీవించలేదు.

అక్బ :—నిరాశాగాఢాంధకారములో మగ్గే జీర్ణకుటీరములో ఆకాశదీపాన్ని వెలిగించే ప్రయత్నము. ప్రచండవాయుప్రచార మా ప్రయత్నాన్ని సాగనీయదు.

బీర్ :—ధైర్యము వహించాలి.

అక్బ :—రాణాప్రతాప్‌సమస్య ఇంకా తేలలేదు. రహస్యమందిరానికి దారితియ్యి.

బీర్ :—మంచిది.

(తెర వ్రాలును.)



# తాన్‌సేన్

## దృశ్యము నాలుగు

(రమ మృత్యుశయ్యపై పరుండియుండును.)

విద్యానంద్ :—ఎల్లాగ ఉంది ?

మకరంద :—లాభము లేదు. వైద్యులు నిరాశచేసికొని వెళ్ళిపోయారు మృత్యుదర్శనార్థము నిరీక్షిస్తున్నాము.

విద్యా :—ఈ సమయానికి పుత్రుడు దగ్గర లేకపోవటము.

మక :—ఏమి చేస్తాము భగవంతుని ఇచ్ఛ ! కాని యీ కొంచెము ఉపకారము మీరు చెయ్యాలి.

విద్యా :—ప్రయత్నము చేస్తాను

రమ :—(కన్నులు మూసి) తానీ - ఇంకా రాలేదూ !

మక :—వస్తుంటాడు.

రమ :—రాడు నాకు తెలుసును. ఆగ్రహించి వెళ్ళిపోయాడు. మాతృ హృదయాన్ని అర్థముచేసికోలేని పెంకితలకాయ.

మక :—కాని, అవసానదశలో తన ధర్మాన్ని విస్మరించదు.

విద్యా :—(మెల్లగ) మందివ్వండి.

(మకరంద్ మందిచ్చును.)

రమ :—నన్ను మందులతో చంపకండి, తానీ (అని నిట్టూర్పు విడచును) రాడు. నాకు తెలుసును.

మక :—అడుగో, వచ్చాడు తాన్‌సేన్ !

రమ :—సంతోషముతో లేవబోవును) వచ్చావా, రా నాయనా ! తానీ !

విద్యా :—(తనలో) పుత్ర వ్యామోహముతో యమయాతన చెందు తోంది. (విద్యానందు మాట్లాడ లేకపోవుచు)

మక :—తాన్ సేన్ ! అమ్మతో చెప్పు, అక్బరుపాదుషా ఆస్థానములో గాయకపదవి నాక్రమించానని. సామంతజనము నీకు బ్రహ్మ రథము పట్టుతున్నా రని.

రమ :—నిజమేనా నాయనా ! (చేతులతో తడుముచు)

(విద్యానందుడు మౌనము వహించును.)

మక :—తానీ కన్నీళ్ళ కార్చిన లాభములేదు. చెప్పు అనింద్యసౌం దర్యముగల రాజపుత్రస్త్రీ నిన్ను వరించిందని. ఆమె వివాహ మాడి నీ జీవితాన్ని సౌఖ్యాంబునిధిలో ముంచుతోం దని చెప్పు

రమ :—(బాధతో) నిజమేనా ! నాయనా ! మీ సంసారాన్ని చూచి ఆనందించే అదృష్టము నాకు లేదు. సౌఖ్యముగా జీవించి వంశ గౌరవము నిలబెట్టు నాయనా ! (బాధ నటించి) దాహము !

విద్యా :—(నీళ్ళు పోసి) నేను సౌఖ్యముగానే ఉన్నాను.

మక :—తాన్ సేన్, అంత్యకాలములో పుత్రదర్శనము కల్గించనే తృప్తితో మరణిస్తుంది మీ అమ్మ. చెప్పు సౌఖ్యముగా జీవి స్తున్నా నని.

విద్యా :—అమ్మా ! నేను సౌఖ్యముగానే జీవిస్తున్నాను.

రమ :—(కరస్పర్శ చేస్తూ) తానీ ! విచారించకు. సమస్త మెరిగిన నీవు విచారించకూడదు అశ్రుబిందువులు పుణ్యలోకాల కడ్డువస్తాయి భగవంతుని స్మరించు.

మక :—తానీ ! అమ్మ వెళ్ళిపోతోంది. చేయి భగవంతుని నామస్మరం

విద్యా :—భగవంతుని నామస్మరణము చేయుదురు)

గేయం.

లెండు పాపపు మనుజులారా!
కనుల తెరవండోయ్! మీరు
ప్రభుని కొలవండోయ్!

జగమె శాశ్వతమంచు యెపుడు
తలచబోకండోయ్ – బాబూ
తలచి చూడండోయ్!

కులుకుచే కూడు తొడిగేవలువా
కూడారాదని నమ్మండీ
మరణమందే సమయమందు
మాధవుడె మనకు తోడు
మదిని నమ్మండోయ్

లెండు పాపపు మనుజులారా
కనులు తెరవండోయ్! మీరు
ప్రభుని కొలవండోయ్!

కాంతా కనకంబే మనకిగోరి
ఘనదుర్మార్గంబుల మితిమీరి
నరకబాధలను కడువేసారి
అరయుకమానరు ఆ సర్వేశుని

లెండు పాపపు మనుజులారా
కనులు తెరవండోయ్! మీరు
ప్రభుని కొలవండోయ్!

(రఘు మరణించును)

మాన:—ఆరిపోయింది దీపము. పండిత్ జీ సెలవు. నా ప్రార్థన నంగీకరించి, నీవు తాన్ సేన్ పాత్ర ధరించి మాతృహృదయానికి శాంతిని చేకూర్చావు, ధన్యవాదాలు!

విద్యా :—పండిత్ జీ! ఆమె అంత్య వాక్యాలు, ఆ కరస్పర్శ నా హృదయాన్ని కలచివేశాయి. నేను ఆమె పుత్రుణ్ణి.

మక :—నాయనా! సంతోషము కాని, బంధాలన్నీ తెగగోసుకొన్న నాకీ నూత్న బంధము బాధాజనకము. నా ఆశీర్వచనము పొంది జగద్విఖ్యాతి గాంచు నాయనా! తాన్‌సేన్ నిన్ను గలుసుకొంటే తల్లి పొందిన బాధను వర్ణించి, ఆమె ఆత్మతృప్తికి అశ్రు బిందువులను రాల్చుమని చెప్పు.

విద్యా :—చిత్తము.

(తెర వ్రాలును)



# తాన్ సేన్

## దృశ్యము అయిదు

(తానీ - తాన్ సేనులు కల్పితోద్యానవనములో)

గేయం.

తాన్ :— ఈ భృంగంబే యెందరి సుమముల
బిగికౌగిటిలో మునపడెనో !

తానీ :— ప్రేమజగతిలో యేలాసంఖ్యలు
ప్రేమము పరమేశ్వరులీల !

తాన్ :— ఆ లతాంగులకు అర్పితుడా
అయ్యో శీలము అనుగంటినదా ! ॥ఈ భృ॥

తానీ :— వలపుతీపిలో వర్ణమే లేదు
కులుకు పలుకులో కులమే లేదు ॥ప్రేమ॥

తాన్ :— జీవితాశయము లింతేనా
జీవించుటలు అంతేనా ॥ఈ భృ॥

తానీ :— ప్రేమమయజ్యోతి వెలిగించుటకే
ప్రేమారాధన చేయుటకొఱకే ! ॥ప్రేమ॥

తాన్ :—తానీ ! నీ వెంతపిచ్చిదానవు ! అపరిచితవ్యక్తి వెంటబడి అక్బరు ఆస్థానములో ఆనంద మనుభవించే అవకాశాన్ని పోగొట్టుకొన్నావు. ఇంతికంటె మాధుర్య ముంటుందా ?

తానీ :—ధృవతారమీద దృష్టినిల్పి ప్రచండతరంగాలలో, ఆకాశముతో సరససల్లాపాలాడే సముద్రముమీద నౌకను నడలుట మాధుర్య మా తే—

తాన్ :— కాని, నీవు చూచింది ధృవతార అని యెల్లాగ చెప్పగలవు ?
తానీ - నా మనస్సు చెప్తుతోంది.
తాన్ :—అది మోసముచేస్తే ?
తానీ :— అది మధురదుఃఖమే అవుతుంది.
తాన్ :— తానీ ! ఝిల్లీదర్బారుకు కవికల్పితసౌధాలకు భేదముందా ?
తానీ :—భూమ్యాకాశాలకున్నంత. నే నొంటరిగా రాజదర్బారులో సంచరించేటప్పుడు ఆ మానవకల్పిత సౌందర్యాన్ని పరికించి నపుడు నా కంటె ధన్యులు లేరని సంతోషించాను. లలితకళ లను సువర్ణపంజరములో బంధించి, అక్బరు లోకానికి చూప గల్గుతున్నాడని సంతోషించాను. అక్బరుపాదుషా సింహాసనము మీాద కూర్చున్నప్పుడు ఆతని కరుణాకటాక్షా న్నపేక్షించే, కళోపాసకు లాతని పాదరజానికి ప్రాకులాడుతున్నప్పుడు చూచాను. అప్పుడు కళోపాసకుడు యాచకుడై నృపాలుని దాతృత్వాన్ని వాంఛించి, మోకరించటము చూచి, ఆ అవ మానాన్ని సహించలేక దేవుణ్ణి ప్రార్థించాను అక్బరుపాదుషాకో సమానపీఠాలో మెలగి కళకున్న గౌరవాన్ని నిలబెట్టే పం డితుణ్ణి చూపించమని. ఆతడు కరుణించి నిన్ను పంపించాడు.
తాన్ : —(నవ్వుతూ) ఆ వేశములో అక్బరును తిరస్కరించి, ధిక్క రించి వచ్చావు దాని ఫలిత మూహించుకొన్నావా ?
తానీ :—అక్బరు కాని, ఆతని సేన కాని యడుగుపెట్టలేని సురక్షిత దుర్గములో నివసిస్తున్నాను.

విశ్వపతినైన బెదరింప వెరువనట్టి
ప్రకృతియే నిన్ను సేవింప భయము జెంద
యక్బరన నెంత ? యాతని యబ్బయైన
వచ్చి నీ సేవ గావింప వలయు బ్రతుక.

తాన్ :—అయితే నేను విన్న అక్బరు కవికల్పిత మొగల్ సామ్రా ట్టన్నమాట.

తానీ :— అక్బరును మించిన రాజు భారతదేశములో జన్మించి, ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించ లేదంటే అతిశయోక్తి కాదు. నా కళ్ళార చూచాను. సింహ సదృశులైన నృపాలురు కూడ ఆతని కఠోరదృష్టికి పిల్లిపిల్లలైనారు. ఆతని మధుర కంఠములో శిల లను కూడ ఛేదింపగల మహిమ ఉంది. ప్రేమను వెదజల్లే నేత్రాలలో పరులగర్వాన్ని చూర్ణము చేసి దాసోహ మనిపించే పటిమ ఉంది. ఆతని వాక్యాలలో ఎంత సరళత్వ ముందో అంత రాజనీతి నిగూఢమై ఉంది. అక్బరు దర్శనమాత్రనే జన్మ ధన్య మైందని నమ్మేవాళ్ళలో నేనొకరైను.

తాన్ :—అయితే ఆతని ఆస్థానాన్ని వదలి యెందుకు వచ్చావు?

తానీ :—నా అంతట నేను రాలేదు. నీ వాగమృతము గంగాతరంగ మోస్తరు నా బుద్ధిని అపహరించి నన్నీడ్చుకొని వచ్చింది.

కడువేగంబున దేవభూమి విడి దుర్గాధీశు గచ్ఛ్రింగముల్
ఇట రాజున్ వృషభేంద్రు వెంట గొనిపో నీక్షించు గంగానిధిన్
విడువన్ శక్యముగాని గాననమున భూభృత్తానమునే నిచ్చినన్
కడువేగంబున లాగి తెచ్చితివి గంగన్ మించు వేగంబుతో.

తాన్ :—పశ్చాత్తాప మొందుతున్నావా! మళ్ళా అక్బరుదర్శన మపే క్షిస్తున్నావా?

తానీ :—(నవ్వి) మళ్ళీ అక్బరుఆస్థానానికి వెళ్ళటమా! స్వర్గాన్ని రుచి చూచిన మనుష్యుడు నరకాన్ని యాచిస్తాడా? మిమ్ములను వదలి ఒకక్షణమైనా జీవించలేను.

తాన్ :—ఓహో!

పాపమె మూలకందమయి ప్రాభవమొందిన నీచమానవున్
ప్రాపక మొంద చంద్రుడని, పద్మజుడంచు, మురారి యంచు, స

ర్వాపగనాథు డంచు నుతి బంకిలవర్గము చేయుచుండు నా
భూపసభాంతరాళమున నున్న జూరించుట నీకు పోకనే.

ఈ ప్రశంసలు వింటుంటే తిన్న అన్నము అరిగిపోతుతోంది.
పండ్లు తెచ్చిపెట్టనా !

తానీ :—సంగీతము పాడి సృష్టించలేరా ?

మత్తెక్కి చలరేగు మదగజంబుల నాప
సంగీతశాస్త్రంబు సాయమయ్యె
సైకతస్థలి దివ్యసౌధముల్ నిర్మింప
సంగీతశాస్త్రంబు సాయమయ్యె
గృహముల గబళించు కృష్ణవమ్మని మాన్ప
సంగీతశాస్త్రంబు సాయమయ్యె
మృత్యుముఖము జొచ్చు మేదినీసుతు గావ
సంగీతశాస్త్రంబు సాయమయ్యె
ఆకసంబున విహరించు నంచజంబు
పిలువ సాయంబుచేసిన విమలగీత
మేల ఫలముల సృష్టింపఁజాల దిపుడు ?
పాడి చెవి కింపుజేయుమా ! భవ్యచరిత !

తాన్ :—అప్పుడు ప్రేమించిన వెలదికై శ్రమలుపొందే అనకాశము
లభించదుకదూ !

తానీ :—సంగీతములో మాధుర్యము లేదా !

తాన్ :—దానికంటె శ్రమలో ఎక్కువమాధుర్య ముంది. ఈ లోపున
భయంకర క్రూరసత్వాలు వస్తే.

తానీ :—మీరు నేర్పిన రాగ ముందికదూ !

తాన్ :—జాగ్రత్త ! (అని వెడలును.)

తానీ :—రాగములో ఇంతమాధుర్య ముందని, శక్తి ఉందని నాకు మునుపు తెలియదు. ప్రకృతినే సంపూర్ణముగా శాసిస్తుంది. (ఆశ్చర్యముతో) ఎవరు? అక్బరుసార్వభౌములా? ఇంతటిగా చక్రవర్తితో సంభాషించటము సాధ్యమవుతుందా?

అక్బ :—తానీ!

తానీ :—ప్రభూ! ఆజ్ఞ!

అక్బ :—తాన్‌సేన్ ఇంట్లో ఉన్నారా?

తానీ :—లేరండి. బయటకు వెళ్ళారు.

అక్బ :—ఎప్పుడు తిరిగి వస్తారు?

తానీ :—నాకు తెలియదు. దయచెయ్యండి.

అక్బ :—నేనొకటి ప్రార్థిస్తున్నాను, నీ వంగీకరిస్తావా?

తానీ :—నేను తమ పాదసేవకురాలనుకదా! తమవంటివారి మాట నాకు సెలవీయవచ్చునా?

అక్బ :—తాన్‌సేను అద్వితీయ కళారహస్యకోవిదుడు. ప్రియమైన ప్రకృతిని గాలించి, నాదశాస్త్రములోని పరమరహస్యాలను బైకి లాగగలడు. కాని—

తానీ :—కాని యేమిటి ప్రభూ?

అక్బ :— ఆ ప్రయత్నము సాగకుండా ఒకవ్యక్తి అడ్డునస్తోంది. ఆ వ్యక్తిని తొలగిస్తే కాని, తాన్‌సేను కీర్తి శాశ్వతముగా నుండదు. ఆ వ్యక్తిని నీవు తొలగించగలవా?

తానీ :—నా శక్తికి అతీతము కాకపోతే; సర్వప్రయత్నాలు చేసి సాధించి తీరుతాను.

అక్బ :—నీకు శక్తి ఉంది. రక్తి ఉందో, లేదో చెప్పలేను. ఆ ప్రయత్నము చేసి నగ్గటానికి తాన్‌సేనుడు నీవు గాఢముగా ప్రేమించి ఉండాలి.

తాని :—ప్రభూ ! తాన్‌సేనును తానీ యెంత ప్రేమిస్తోందో తానీకే తెలియదు. ఆ ప్రేమను తాన్‌సేను అనుభవించగలడు కాని, వర్ణించలేడు.

అక్బ :—అయితే తాన్‌సేన్ అమరకీర్తిని పొంది; భారతీయుల ప్రతిభకు మెరుగు పెట్టగలడు.

తాని :— ఆ కీర్తిలో తానీ అప్పుడప్పుడు విద్యుల్లతమోస్తరుగా మెరుస్తూఉంటుంది. తానీ, తాన్‌సేనులు చంద్రుడు చంద్రిక అని లోకము గ్రహిస్తుంది.

అక్బ :—అయితే ప్రయత్నముచేస్తావా ?

తాని :—ఆ వ్యక్తి యెవరు ?

అక్బ :—నీవే ! నీవు ప్రక్క నున్నంతవఱకు నిన్నారాధిస్తూ, నీ ప్రేమలో ఆనంద మనుభవిస్తూ కళోపాసన చేయడు. అతనికి పేరు రాదు. కనుక, అతని అభివృద్ధికొఱకు, నీవు ప్రేమించిన తాన్‌సేన్ అభివృద్ధికొఱకు నీ వాతని పరిత్యజించాలి,

తాని :—ఏ మంటున్నారు ? సార్వభౌమా ! తాన్‌సేనును వదలి తానీ జీవించాలా ? జీవించగలదా ? జీవించగల దనే విశ్వాసము మీకుందా ? తానీ, తాన్‌సేను లెంతగాఢముగా, విచిత్రముగా బంధింపబడ్డారో మీరు రూహించగల్గితే ఈ విధముగా చెప్పరు మీరు ప్రభువులు. పేదలహృదయాలలో ఉన్న పవిత్రప్రేమను అర్థముచేసికోలేరు కనుక, ఆ విధముగా శాసిస్తున్నారు.

నీకా విడనాడి దిశలన్ని విస్తరించి
సూక్ష్మ సూక్ష్మవిరూపాల చొచ్చి మెసల
మధురతకు భావచిత్రాల మసలుచున్న
నావ మాతడు, వీణియ నగుదు నేను.

అక్బ :—తానీ ! నాకుగూడ ప్రేమ అంటే తెలుసును. నెత్తిమీద కిరీటము ధరించి నా హృదయము ప్రేమసంభరితమైందే. తాన్

సేన్ అభివృద్ధికి నీవు త్యాగముచేయక తప్పదు. మీ ప్రేమ అను
పమానమైంది కనుక త్యాగముకూడ అనివార్యమైంది కావల
యును. తన, ఆనందముకొఱకు తన ప్రియుని [illegible] అభివృద్ధి
కడ్డువచ్చేది మోహము ప్రేమలో త్యాగము, మోహములో
స్వార్థ మిమిడి ఉన్నాయి.

వీణతంత్రులు నిద్రించు విమలనాద
మాతృదేశంబు వీడి తద్యశముపెంప
దశదిశల ప్రాకి, క్రమశః తగ్గి తగ్గి
లయముచెందును వీణను ప్రజలు మెచ్చ.

తాని :—కాని,

అక్బ :—కాని; అనకు తాన్‌సేను శాశ్వతముగా ఉండవలెనని, భార
తీయుల ఖ్యాతి విదేశాలలోకూడా వ్యాపించవలెనని, నీవు మాత్రము
త్యాగముచేయుటయే మన విధి. చేయవలసిన కృత్యము.

తాని :—ప్రభూ! తమరు నిజముచెప్పారు. నేను త్యాగముచేస్తాను.

అక్బ :—తాన్‌సేన్‌తో చెప్పి వెళ్ళు.

తాని :—అది నాకు సాధ్యముగాదు. ఆతని ముఖము చూడగానే
నాకు పిచ్చెత్తిపోతుంది. అతని మాటలు వినగానే నేను వి
కృతిని పొందుతాను. అత డాజ్ఞ ఇవ్వగానే పంజరపక్షి వలెనున్న
కదలలేను, మెదలలేను. తాన్‌సేన్ రాకముందే నేను పోతాను.
నా కాజ్ఞ ఇవ్వండి. పోతాను.

అక్బ :—తానీ! నీ త్యాగాన్ని భారతదేశము మరిచిపోలేదు. జ్ఞాపక
ముంచుకొని, కృతజ్ఞతను చూపిస్తుంది.

తాని, నీ ప్రేమత్యాగముల్ తలచి భార
తీయు లెప్పుడు నృత్యంబుచేయునపుడు
'తా, నీ' యను వర్ణములజంట తలచుచుంద్రు
శాశ్వతంబుగ మీ జంట, జగతి వెలయు.

తాని :—మహాప్రసాదము! నేను వెళ్ళిపోతున్నాను కాని, అక్బరు మహాశయా! తానీ గుండెలు బ్రద్దలై యేడుస్తూ, యేడుస్తూ తప్పనిసరిగా వెళ్ళిందని చెప్పండి.

గే య ం.

నా వలపువీణియకు తంత్రు లే పగిలె
నా జీవితాశయము నడియేటగూలె!
నా వాంఛ మొదలంట నశియించిపోయె
నా ఆశ ననువీడి పయనమైపోయె!
ఆనంద జ్యోతియే అయ్యయోపోయె
నా బ్రతుకు చింతలకు ఆలయంబాయె!
నా వలపువీణియకు తంత్రులే పగిలె
నా జీవితాశయము నడియేటగూలె!
వెలిగేటి జ్యోతియే వెలుగు విడనాడె
మబ్బులే తారకల మాయమొనరించె
భోగలాలసమైన బ్రతుకు గతియించె
త్యాగంబు వేరిట తనువు కష్టమనిపించె!
నా వలపువీణియకు తంత్రులే పగిలె
నా జీవితాశయము నడియేటగూలె!

(పాడుకొంటూ వెళ్ళిపోవును)

అక్బ :—ఎంత స్వల్పకాలములో ఎంత గాఢమైన ప్రేమ, వియోగము దుర్భరమైనా తాన్ సేన్ రాహువిముక్త చంద్రుడై అమర గానామృతాన్ని వెదజల్లుతాడు.

(తాన్ సేన్ పాడుచు ప్రవేశించును.)

గే య ం.

తానీలేని ధరణి యిదేల
తానీలేని బ్రతుకు యికేల!

చుక్కచూపులలోన
సొగసు పూవులలోన
పండువెన్నెలలోన
నిలిచి నవ్వేనాడు
తానీ లేని ధరణి యిదేల
తానీ లేని బ్రతుకు యికేల!
వీణాతంత్రుల
విశ్వమోహినిగ
శాశ్వతానంద
సాధన జేయుంచు
తానీ లేని ధరణి యిదేల!
తానీ లేని బ్రతుకు యికేల!

తాన్:—ఎవరు అక్బరు సార్వభౌమా! [illegible]!

అక్బ:—వెడలి పోయింది.

తాన్:—(పండ్లు జారవదలి) వెడలి పోయింది! [illegible]. చంద్రుణ్ణి వదలి చంద్రిక వెడలి పోలేదు. [illegible].

అక్బ:—తాన్‌సేన్ అభివృద్ధికొరకు తాను శాశ్వతముగా వెడలి పోయింది

తాన్:—ఎక్కడకు.

అక్బ:—నాకు తెలియదు.

తాన్:—(ఆలోచించి) నిర్భాగ్యురాలు. [illegible]. ఎవరి ఆజ్ఞనుపొంది వెడలిపోయింది.

చూపితి సర్వశాస్త్రముల సూక్ష్మతమాంశ [illegible]
చూపితి గానసత్కళను సూరివరుల్ తలయూప [illegible]
చూపితి నాదశక్తి రిపుసూదన పాటవమొప్ప [illegible]
చూపక లేశమైన పరిశుద్ధమనంబున బోయె [illegible]

అక్బ:—నేను ప్రార్థించాను. తాన్‌సేన్ అభివృద్ధికి రావాలంటే అతని వదలి యెక్కడికైనా వెళ్ళమని ప్రార్థించాను. మొదట నిరాకరించింది. తర్వాత వెళ్ళిపోయింది.

తాన్:— ఆమె నేర్పు. మీరు చక్రవర్తులు. ఇద్దరుకు మానవ హృదయము తెలియదు. ఇద్దరు కలసి తాన్‌సేనును ఖూనీ చేసారు, ఈ రోజు మొదట తాన్‌సేన్ విషాదగీతాలతో మృత్యుదేవతను వరించి ఉద్వాహమాడుతాడు. ఆ సమయములో ప్రభువులకు పిలుంగా వచ్చి వధూవరుల నాశీర్వదించి పోవచ్చును.

అక్బ:— నీ వంటి మహాత్ములిట్టి సమయములో నిరాశ చెందకూడదు. మా ఆస్థానాన్ని అలంకరించి భారతీయ గానాన్ని నూతన మార్గాలలో నడిపించండి.

తాన్:— పిచ్చిసార్వభౌమా! మానవ హృదయాలను గుర్తింపలేని రాజనీతి విశారదా! తానిపియోగ దుఃఖాన్ని తాన్‌సేన్ భరించలేడు. తాని కృంగిపోయినా ఆ వియోగములో తాన్‌సేన్ క్రుళ్ళిపోతాడు. అటువంటి తాన్‌సేనునకు సంచార యోగ్యస్థానములు పతనవనాలు, కూలినసౌధాలు, ఆక్రందనధ్వనులతో హృదయాలను ప్రక్కలుచేసే విషాద దుర్భరిత ప్రదేశాలు. శృంగార రసముతో, భోగభాగ్యాలతో ఆనందముతో పగనవ్వు త్రోక్కే రాజభవనాలు కాదు.

ఎఱుగవు గానకోవిదుల కెట్టి పరాభవ మెంత బాధయో
ఎఱుగవు వారిచిత్తముల నెట్లు నసించునో శిష్యకోటి నీ
వెఱుగవు వారి బంధములనెంత దహించునో మోహమోహప్రభూ
ఎఱుగుదువీవు రాజ్యములు చేయుట చీల్చుట శస్త్రరాజులన్.

అక్బ:— అయితే నా ఆశాసౌధాలన్నీ కూలినట్లే.

తాన్ :—సైకతస్థలాలలో నిర్మించిన సౌధాలన్నీ అజ్ఞానములో అహం కారాన్ని సమ్మిశ్రితముచేసి నిరశించే సౌధాలన్నీ కూలక తప్పదు. అయినా మీ రాకసార్థకమే. తానిని అపహరించి తాన్‌సేనును ఖూనీ చేసారు. పిచ్చివానిగామార్చి తృప్తిచెందక ఖూనీచేసారు. మీరు ధన్యులు. సెలవు.

అక్బరు ఏదియో చెప్పబోవును,)

తాన్ :— అక్బరు సార్వభౌమా! ధన్యులు దయచెయ్యండి (అని గంభీరధ్వనులు పల్కెను.)

(అక్బరు వెడలి పోవును.)

గే య ం.

సాదుసా పలుకులే
బ్రహ్మవాక్యాలా ! తానీ !
వలపు లోతులయాత
తెలిసికొనలేదా ! తానీ !
హృదయాలు కలిసినా
ఉన్నతాశయవిలదా తానీ !
పిచ్చివానిగ చేతువా
బిచ్చమెత్తుట నేర్పెదా తానీ !
ప్రేమభిక్షుకుడనై
వీధులను తిరుగనా తానీ !

తాన్ :—తానీ! నీ వింతమూర్ఖురాలవని నేననుకోలేదు. మానవ హృదయాల లోతు గుర్తింపలేని మూర్ఖురాలవు. శాశ్వతము కాని ధనానికాసించి సార్వభౌముని యాజ్ఞను తిరస్కరించే గుండెధైర్యములేక, అనన్యసాధ్యమైన యదృష్టవసాత్తు లభ్యమైన అమృతాన్ని పారలదన్నుకొన్నావు. కీర్తిపర్వతాగ్రము మీద నిలబెడితే వెట్టిగంతులువేసి గంభీరగర్తలో కూలిపో

యావు తాన్ సేన్ జీవితాన్నే! భ్రష్టముచేసావు, కృతఘ్నురాలవు, వేశ్యవు, నీచహృదయవు. (ఆలోచించి) తాన్ సేన్ విషాదజీవితములో లలిత కళ లేదా! (దుఃఖములో) అమృతము లభించదా! తాన్ సేన్ మధుర దుఃఖాన్ని అనుభవించు. ప్రపంచములో విషాదగీతాలను వెదజల్లి మానవనేత్రాలలో ఎన్ని అశ్రుబిందువులున్నాయో ఎంతవఱకు మానవహృదయము పరులదుఃఖాలకు విలపింపగలదో పరీక్షించు.

ఇదుగో నా హృదయాన
మొదలిడెను పెనుగాలి
యెవరోయి మొనగాడు
చల్లార్పగలవాడు

        పిడుగులే పడ్డాయి
        విప్లవమె లేచింది
        ఉరుము లురుమేనురా
        ఊరకున్నారా?

ఆశాభవంతియే
అదిగో కూల్పడిపోయె
నైరాశ్య వాయువులు
నాట్యమొనరించాయి!

        ప్రేమభిక్షుకుడనై
        వీధివీధుల వెంట
        వినవిషాదపుపాట
        వినిపింతు నికరందు

ఇదుగో నా హృదయాన
మొదలిడెను పెనుగాలి
యెవరోయి మొనగాడు
చల్లార్పగలవాడు.

(విషాదగీతము పాడుచు వెడలిపోవును) (తెర వ్రాలును)

# తాన్ సేన్

## దృశ్యము ఆరు

(దిలేరా భవనములో ఆస్థానగాయకుడు, విద్యాసందుడు ప్రవేశించును)

ఆ. గా :—శ్రుతులపిచ్చి మా శిష్యునివలన దేశములో వ్యాపించింది. యంత్రాలు సరియైనశ్రుతులలో ఉన్నాయి.

విద్యా :—తాన్ సేనా ? సంగీతములో ప్రవేశమైనా లేని తాన్ సేనా! యంత్రాలలోఉన్న అపశ్రుతులను కనిపెట్టటం నోటికి భాయింపు మినహాయిస్తే ఇంకొకటియేమీ లేదు.

ఆ. గా :—కాని ఆ మహాత్ముని పేరుతో ఏ అరగిపోయిన నాణెమైనా చెలామణి అవుతోంది.

విద్యా :—నా కళ్ళముందర పుట్టిపెరిగిన తానికి ఎంత అదృష్టము పట్టింది.

ఆ. గా :—అతనిగురువునంటే నీకు బ్రహ్మరథము పట్టారు. మొగలాయి సామ్రాజ్యములో కనకాభిషేకముచేస్తారు.

విద్యా :—అతని గురువుననటానికి నా కంఠంతో అవమానము కాని పరిస్థితులనుబట్టి దుస్తులుమార్చాలి.

ఆ. గా :—రాజకుమారి వస్తోంది. తాన్ సేన్ మీరొని అసహ్యాన్ని చూపించకు. అమరలోకమునుంచి ఊడిపడినవ్యక్తిలా ప్రవర్తించాలి. తెలిసిందా.

విద్యా :—తాన్ సేన్ గురువుననిపించు కొనటంకంటె మీ శిష్యుడననిపించుకొనటము లోనే నా కెక్కువగర్వముంది.

ఆ. గా :—కాని వీరిదృష్టిలోనే నొకపురుగును అజ్ఞానములో ప్రసన్న పోయే రాజులను సేవించటముకంటె భిక్షాటనము చేయుటము మేలు. కాని యేమిచేస్తాము. రోజులనుబట్టి యెంతవారైనా ఒడిగట్టాలి.

(ఏలేరావచ్చి యుపవిష్టురాలగును)

ఆ. గా :—అమ్మా ! సలామ్. ఈతడు శ్రీ శ్రీ తాన్ సేన్ గాయక శిరోవతంసునిగుమవు శ్రీయుత విద్యానందగాయకసామ్రాట్

దిలే :—(భయభక్తులతో లేచి నమస్కరించును.)

ఆ. గా :—అమ్మా ! ఆజ్ఞ !

(దిలేరా విద్యానందుని వైపు దృష్టిప్రసరించును)

ఆ. గా :—గాయక సామ్రాట్ ప్రారంభింపుడు.

(విద్యానందుడు పాడుచుండును)

(దిలేరా ఆశ్చర్యనిమగ్నయై - పండితవర్యా విశ్రమింపుడు.
విద్యానందుడు సిగ్గున తలవంచును.)

గాయకుడు :— గేయం

చంద్రుడా నీ కింత సాహసంబేలరా
చాలు - నీ ముప్పులకు సంశయముపడరా !
ప్రణయమే జీవితపు
వాంఛ కాక్షోలురా !
వహ్వాగే - నీ వంటి
సంసుడే లేడురా !
చంద్రుడా ని కంత సాహసంబేలరా
చాలు నీ ముప్పులకు సంశయము పడరా
తారకల కౌగిళ్ళ
తనివి చెందగలేవు

సతత సమ్మోహనాలు
సాగించెదవురా !

చంద్రుడా నీకింత సాహసంబేలరా
చాలు నీ ముప్పులకు సంశయము లేదా.

(అని పాడును.)

దతే : గాయకవర్యా ! అమరికవిత్వమును వినిపించిరి. ధన్యులు.

విద్యా ;—అమ్మా ! యిది సంగీతము.

దతే :—పాషాణనిర్మిత సమాధులను చేధించుకొని అనముకల కవిత్వము వెల్వడుచున్నది. ఈ సృష్టి శ్రీ శ్రీ గాయకసామ్రాట్ తాన్‌సేనే పూజ్యపాదులదని మా నమ్మకము.

ఆ. గా :—తమ యీ సద్భావమునకు ధన్యవాదములు

(అక్బరు ప్రవేశించును.)

(అందరు సలామ్ చేయుదురు)

అక్బ :—ఈ వేళ ఆరోగ్యమెల్లాగ ఉంది.

దతే :— (బాధను సూచిస్తూ) ఏమీ తగ్గలేదు. నూతన సంగీతము విను టవలన తలనొప్పి వచ్చినది.

అక్బ :—వైద్యులు రా లేదా ?

దతే :— అవసరము లేదు మానసికవ్యాధిని వైద్యులు కుదర్చలేరు.

అక్బ —(తెల్లపోయి) మానసికవ్యాధియా ! ఢిల్లీపాదుషా కూతురుకు కూడ మానసిక బాధయా ?

గాయ :—ప్రభువులు క్షమిస్తే !

అక్బ —భయములేదు చెప్పండి.

గాయ :—అమ్మాయిగారు తాన్‌సేన్ రాగము వినాలనే ఉబలాట ముతో బాధపడుతున్నారు. అది సాధ్యముకాదని బెంగపెట్టు కొన్నారు ప్రభువులయత్నానికి సాధ్యముకానిదిలేదని మనవి చేస్తున్నాను.

దిలే :—అక్బరుదుహిత కసాధ్యమైనపుడు అక్బరుసార్వభౌమున కసాధ్యము కాదా !

అక్బ : అమ్మా తాన్‌సేన్‌కంటె మనగాయకులే హాయిగా పాడగలరు

దిలే :—అందుకనే కోకిలను కాకులచెంత వదలిపెట్టారు. కోకిలారావము కంటె కాకికూత బాగుంటుందని ప్రపంచానుభవముకల పెద్దల నమ్మకము. ఈ వేళ స్వానుభవముకల కోకిలగురువులు కాకులని గ్రహించాను.

గాయ :—అమ్మగారి సంగీతములో అనుభవమెక్కువ ఎప్పుడు వినటము వలన కోకిలారవములోని మాధుర్యముచచ్చి అరుదుగా వినటమువలన కాకికూతలో కమ్మతనము కనబడుతుంది. మళ్ళా వినాలనియే బాధజనిస్తుంది.

అక్బ :– దిలేరా ! తాన్‌సేన్ కంఠములో మాధుర్యమున్నా హృదయములో అహంకారమున్నది. అదికళను చంపేస్తుంది. అంతకంటె మనగాయకులు హాయిగా పాడుతారు.

గాయ :—అక్బరుసార్వభౌములు నిజము చెప్పటములో నిపుణులు. ఇతరుల శక్తిని గ్రహించి స్తుతించి ఆరాధించటములో అగ్రగణ్యులు.

దిలే :—నాన్నగారూ ! మీ మనస్సు అతికోమలమైంది గార్దభకంఠములో కమ్మనిస్వరాన్ని చూచేనేర్పు మెచ్చుకొనేశక్తి మీకున్నాయి.

గాయ :— లేకపోతే కన్నతండ్రులు సంగీతము చెప్పించగలరా ! మా బోటిగాండ్రు బ్రతుకగలరా.

అక్బ :— గురువుగారూ !

(ఆస్థానగాయకుడు, విద్యానందుడు సలాంచేసి వెడలిపోవుదురు)

అక్బ :—(నవ్వుతూ) అమ్మా గురుధిక్కారము.

దిలే :—తాన్‌సేన్ ప్రశంసనువిని ఉడికిపోతున్నాడు. తాన్‌సేను గురువట. శిష్యులకవమానము తెచ్చిపెట్టే గురువులు. శిష్యుల పేరు చెప్పకొని జీవించే అగ్రశ్రాతలు.

అక్బ :—కాని తాన్‌సేనుమీద నీకంత అభిమానమెందుకు.

దిలే :—మీకు నామీదఇంతమమ కారమెందుకు ?

అక్బ :—పుత్రికవని.

దిలే :—అందరుతండ్రులు లింతగాఢముగా ప్రేమిస్తున్నారా ?

అక్బ :—(నవ్వును)

దిలే :—సోదరుడని. ఒకేదేవత నారాధించే పూజారిఅని.

అక్బ :— నీ వాతని సోదరివని ఆతడంగీకరించడు.

దిలే : —కుమారుడు నిర్లక్ష్యమువహించినకొలది తల్లిప్రేమ వృద్ధిపొందుతుంది.

అక్బ :—తాన్‌సేన్ సంగీతము వినుటవలన నీరోగము కుదుగుతుందా.

దిలే : —అని హృదయము చెప్పతోంది.

అక్బ :—అత డంగీకరిస్తాడని నేను తలవను

దిలే :—అత డంగీకరించి తీరుతాడు. సంగీతశాస్త్రాన్ని వ్యాపింపజేయాలని కృషిచేసే పండితులు తమగానాన్ని వినాలనే వాళ్ళకోర్కను తప్పక నెరవేరుస్తారు. దిలేరా వాంఛను తాన్‌సేన్ తిరస్కరించడని నా నమ్మకము.

అక్బ :—కాని అతని హృదయము గర్వముతో నిబిడీకృతమైంది. చక్రవర్తులనుకూడ లక్ష్యముచేయని అహంకారము. అత్యంత వ్యయమైన స్వాభిమానము. హద్దుమీరిన ఆత్మగౌరవము.

దిలే :—స్వేచ్ఛకు అహంకారానికి గట్లు కలిసిఉంటాయి. ఆరెంటికి భేదము గమనించడము కష్టమే. కాని తాన్‌సేన్ రాకపోతే—

అక్బ :—ప్రయత్నముచేసి చూస్తానుకాని, కృత కృత్యుణ్ణవుతానని చెప్పలేను.

దిలే :—తప్పకుండా నెగ్గుతారనే విశ్వాసము నాకుంది. అతను కళో పాసకుడు అతనిహృదయ మతికోమలమైంది. అతి పవిత్రమైంది. యాచకుల వాంఛలను తిరస్కరింపజాలని యుదారస్వభావము కల భారతీయుడు

అక్బ :—ప్రయత్నము చేస్తాను. (వెడలిపోవును)

దిలే :—రాడేమో! ఢిల్లీపాదుషా ఆజ్ఞలను తిరస్కరించే సాహసమాతని కుంది. అత డద్వితీయమూర్తి అతని రక్తనాళాలలో పవిత్రో జ్వలరక్తము ప్రవహిస్తోంది. స్వాతంత్ర్యాన్ని స్థాపించే తీవ్ర దీక్ష. అతని నేత్రజ్యోతి తానీసశాసించే ఆ గంభీరస్వరము ఇప్పటికి నా చెవులలో గింగురుమంటోంది. అతని కంఠములో ఎంతమాధుర్యముంది. జడప్రకృతికూడ అతని మధురకంఠానికి జోహారుచేసి వివిధరసోన్మత్త సుకరంధమై కలపిస్తుంది, ప్రలాపిస్తుంది. ఆరణ్యములోఉన్న పశుపక్ష్యాదులు, సంచా రములేని పక్షిలతాదులు అతని మధురకంఠాన్ని విని ఆనం దిస్తుంటే – భారతదేశాన్ని తనకఠోరశాసనాలతో ఛేదించి తన యపూర్వరాజనీతిలో తన యిచ్ఛవచ్చినట్లు బంధించి ప్రేమతో ఆపరాజయావమానాన్ని హరించి ఉన్నతాశయాలను చూపించి ఆశలను రేకెత్తజేసిన అద్వితీయమూర్తి అని పేరుపొందిన అక్బరు సార్వభౌముని ప్రియపుత్రిక – ఆ సంగీతానికై ఘోరతపము చేసినా సంపాదించలేకపోతోంది.

(తెర వ్రాలును)

△

# తాన్ సేన్

## దృశ్యము ఏడు

(విజయ, విద్యానందుడు, ఆస్థానగాయకుడు ప్రవేశించును.)

ఆ. గా :—మనమెన్ని ప్రయత్నాలుచేసినా తాన్ సేన జీవించి ఉన్నంత వఱకు మనకు పేరురాదు.

విద్యా :—ఆ కట్టుకుంక కంత మీరు భయపడటము నాకెంతో ఆశ్చర్యముగాఉంది. ఆ తాన్ సేన్ నా కంటపడ్డాడంటే రెండు చివాట్లుపెట్టి మీ పాదశుశ్రూషచేయించగలను.

విజ :—చిన్నప్పటి అనుభవాలను జ్ఞాపకముచేసికొని స్థైర్యాన్ని వహిస్తున్నారు. కాని ఇప్పటి తాన్ సేనును మీరు చూచి ఉండరు.

విద్యా :—బాహ్యాశరీరము మారవచ్చును కాని తత్త్వముమారదుకదా

ఆ. గా :—కాని తాన్ సేనును ఒప్పించటము ఎల్లాగ.

విజ :—ఆ భారము నేను పూనగలను. తాన్ సేనును నా చమత్కారముతో నా శృంగారలీలతో బంధించి తేగలను. కాని—

విద్యా :—వస్తే ఈ మహాత్ముని పాదాలుపట్టి శుశ్రూషచేయించే బాధ్యత నాది.

ఆ. గా :—నాకు భరించరాని భయమువేస్తోంది, మనపేరంతా గంగలో కలసిపోయింది. ఇప్పుడు రెండుకార్యాలుజరగాలి. మనమిద్దరము అద్భుతకార్యాలుచేసి నూత్నప్రపంచాన్ని లోకానికి చూపించాలి. విజయ తమకున్నరా శరసాయకత్వముతో తాన్ సేనును లంపటుణ్ణి చేయాలి.

విద్యా :—కాని ఈ ప్రయత్నాలు రాజకుమార్తెకు తెలుస్తే మనప్రాణాలు మనవికావేమో !

ఆ. గా :—రాజకుటుంబములో ఎవరికి తెలిసినా మన ప్రాణాలు మనవి కావు. అంతా రహస్యముగా - పరమరహస్యముగా జరగాలి.

విద్యా :—నాకొక ఆలోచనతట్టుతోంది. సంగీతపోటీకి తానసేనును ఆహ్వానిస్తే.

ఆ గా :—ఇంక మన నెత్తిమీద నెంతుక లుండవు. సామాన్యప్రజలు కూడ మనలను కాకులుపొడిచినట్లు పొడిచి చంపుతారు.

విజ :— ఆ వార్తవిందిఅంటే తానీయే గజ్జెకట్టుకొని నిలబడుతుంది. తాన్ సేనుని లంపటుణ్ణిచేస్తే తానీ ఆగ్రహపరవశయై ఆతణ్ణి పరిత్యజిస్తుంది. సంఘము ద్వేషిస్తుంది. దిలేరా నిందించి బహిష్కరిస్తుంది.

విద్యా :—అక్బరుసార్వభౌముడు.

ఆ. గా :—(సంతోషముతో) ఉరిస్తంభ మెక్కిస్తాడు.

విజ :—తమలోఉన్న లోపాలనే ఇతరులలోచూచి అత్యున్నతస్థాన మాక్రమించిన అనఘులు సహించరు. తమ ఆగ్రహాన్ని చూపించటానికి అతిభయంకరశిక్షలను విధిస్తారు.

ఆ. గా :—తాన్ సేనును ఆస్థానగాయకుణ్ణిచేసి నాకు సర్వమంగళము పాడాలని దిలేరా ప్రతిజ్ఞపట్టినట్లు ప్రవర్తిస్తుంది

విజ: —యౌవనసుదర్పమ ఇంద్రియగ్రామమిచ్చే శాసనాలను పాలిస్తూ మహోదాశయాలతో లోకాలను వంచించటము.

ఆ. గా : —నా భవిష్యత్తు మీ చేతులలోపెట్టాము.

విజ :—భయపడకండి. కాని—

విద్యా :—కానియేమిటి గురు సేవలో మన మెంతత్యాగమైనా చేయవలసి ఉంటుంది.

విజ :—ఆత్మార్పణము చేయందే శిష్యరాండ్రు కాజాలరు. కాని సరస్వతిని బంధించటానికి లక్ష్మీకటాక్షము కావాలి.

ఆ. గా :—ఆ రోజులు వెళ్ళిపోయాయి. సరస్వతి లక్ష్మిని బెదిరిస్తోంది లక్ష్మి సరస్వతి పాదాలనుపట్టుకొని ప్రాకులాడుతోంది. లేక పోతే అక్బరుసార్వభౌముడు తాన్సేన్ వంటి నిరుపేదకు జంకుతాడా !

విజ :—మా అభిప్రాయము అదికాదు. తాన్‌సేను సమాధికట్టడానికి కొంతధనముకావాలని. ఆ సమాధి చాల విలువనిలవని మా అభిప్రాయము.

విద్యా :—ఆ సమాధికట్టటము లక్ష్మిచేతకాదు సరస్వతే సాయము చేయాలి.

ఆ. గా :—లక్ష్మిని నీకు కావలసినంత లక్ష్మిని నే నివ్వగలను. ఎంత కావాలి.

విజ :—ఏబది వేలు.

విద్యా :—అంత డబ్బే.

విజ :—కాని తాన్ సేన్ సమాధివలన గురువుగారికి వచ్చే లాభము చాలయెక్కువ.

ఆ. గా :— డబ్బువిషయములో నేనుజంకను. తాన్‌సేను ప్రజలహృదయాలలో లయమైపోవాలి.

విజ :—మరి సెలవా ?

ఆ. గా :— రేపేదిగ్విజయ యాత్రకు బయలు దేరి ప్రయాణించు.

విద్యా :—గుర్వాజ్ఞ.

(విజయ నమస్కరించి వెడలిపోవును.)

విద్యా :—ఈమె ధాటికి తాన్ సేన్ నిలబడగలడు !

ఆ. గా :—ఆ డబాయింపుకు తానే ఆగలేకపోయింది. కాని ఆమె నేత్రాలలో జ్యోతిఉంది. కనుక నా కాశఉంది.

విద్యా :—ఇంకమన ప్రయత్నాలలో ఉందామా !

ఆ. గా : —అల్లాగే నడవండి.

(తెర వ్రాలును)

# తాన్‌సేన్

## దృశ్యము ఎనిమిది

(గంభీరారణ్యములో విషాదగీతమాలాపిస్తూ తాన్‌సేన్)

గేయం.

ప్రేమాంకితమే జీవితంబనుచు
వెతలను గనకుడు ప్రియతములారా!
కాంతకే బ్రతుకు
కానుకచేయుట
నీతి కాదనుడు
నేర్పరులారా!
ప్రేమాంకితమే జీవితంబనుచు
వెతలను గనకుడు ప్రియతములారా!
ప్రేమకు బలియై
జీవితాశయము
చీకుల జేర్చుట
తగదండీ
ప్రేమాంకితమే జీవితంబనుచు
వెతలను గనకుడు ప్రియతములారా!

మానవహృదయ మర్మముకాని మానవులు రసోత్పత్తికి మార్గాలు తెలియని కళారాధకులు. తానీ లేకపోతే తాన్‌సేన్ కృషిచేసి అమరగానాన్ని సృష్టించి అభ్యసించి శాశ్వతకీర్తి సౌధాన్నినిర్మిస్తాడట. సమస్తమతాలను కాచివడబోసి నిగ్గు

తీసి నూత్నమతాన్ని స్థాపించానని గర్వించే మేధావి నమ్మి వెలి
బుచ్చిన పవిత్రనిర్ణయమిద్ది. ప్రేమసూత్రాలలో ప్రపంచాన్ని
బంధించి మానవత్వాన్ని పునర్జీవితము చేస్తానని ప్రగల్భాలు
కొట్టే పవిత్రప్రేమమూర్తి. రాజనీతితో సామ్రాజ్యాన్ని చిర
స్థాయిగా శిలాతలముమీద కట్టిన ప్రతిభాశాలి శ్రీ అక్బరుసార్వ
భౌముని చిరకాలార్జితానుభవపయోధజనితసుధ నిర్ణయము.
మానవతత్త్వము తెలియని మహీపాలుడు సానుభూతిలేని నష్మ-
హృదయాలతో సామ్రాజ్యము స్థాపించిన కఠోరహృదయుడు.
కాని సరస్వతీకటాక్షమువలన నృత్యశాస్త్రమభ్యసించిన తాన్సీ-
మూర్ఖురాలు. పరహృదయములో విరాజిల్లే పవిత్రప్రేమను
గ్రహింపలేక శంకించి పతనము చెందే వేశ్య - ఐహికదృష్టితో
ఆముష్మికసౌఖ్యాన్ని విస్మరించిన పతిత - తాన్‌సేన్ ప్రేమలో
గల మహిమను లోతునుగుర్తింపలేని ఎవరు అక్బరుసార్వ
భౌములా! నమస్తే

అక్బ :—గాయకశిరోమణీ నమస్తే.

తాన్ :—(వికటముగా నవ్వి) నిజము చెప్పావు సార్వభౌమా! తాన్
సేన్ గాయకశిరోమణి. తాన్సీని విసర్జించటమువలన అనురాగ
నము సృష్టిజేసి ఆనందించే అదృష్టముకల తాన్‌సేన్ గాయక
శిరోమణి కాడా! ఆతని లోకసామ్రాజ్యమర్పించి - ఈ భయం
కరక్రూరసత్త్వాభిరామమైన కాంతారసామ్రాజ్యాన్ని అర్పించి
లోకాని కమరగానమర్పించారనే పేరు మీకు దక్కింది ధన్యులు
పృథ్వీవల్లభశిరోవతంసమా!

పృథ్వీ భేదించి లవణాల విరియజేసి
పండ్లసృష్టించు శ్రమయెల్ల! వెళ్ళకున్న
వాని కాశ్రయమిచ్చిన వట పాదపంబు
పులదమనుకీర్తి లోకాల ప్రాకిపోయె.

అక్బ :— నా అభిప్రాయ మదికాదు.

తాన్ :—నాకు తెలుసును. మహారాజులు సుందరవస్తువుల నితరుల చెంత చూచి సహించ లేరు. రత్నాపహారులు రాజులు భారత దేశాన్ని పాలించేమీకు భారతీయసాంప్రదాయాలు పట్టుబడ టములో ఆశ్చర్యములేదు. తానిని అపహరించారు. నిరాశా దేవతను వివాహముచేసారు. ఇందులో మీ తప్పేమిటి? రాజ్య మపహరించి సామంతరాజులను రాజసభలలో సత్కరించటము మీ కులాచార మేకదా !

అక్బ :— పొరబడుతున్నారు.

తాన్ :—కళోపాసకుడు పొరబడ లేడు. సత్యానికి ఆతనికి సన్నిహిత సంబంధము ది. విషాదసతీనృత్యాన్ని తిలకించి ముగ్ధుడవై ఆ సంయోగములోకూడ ఈర్ష్యాగ్నిని అనుభవించి ఆమెనుకూడ విడదీయటానికి వచ్చావు. ఆ విషాదసతి నీ కక్కరలేదని నాకు తెలుసును. ఇతరసౌఖ్యాలను నిర్మూలించట మే తుర్మాధవుల ప్రథమకర్తవ్యము.

తుచ్ఛకీర్తిని వాంఛించి దున్నిబ్రతుకు
రైతుకొంపల గూల్చు క్షేత్రింపుయాత్ర
లక్షరాభ్యాసమును నేర్పు నలవికాన
క్షత్రియులువహ్ని నొకచోట చదువుకొనిరి.

అక్బ :—ద్విజవరేణ్యా ! అక్బరుభిక్షుకుడై నిన్ను యాచిస్తున్నాడు

తాన్ :—అక్బరుసార్వభౌమా ! నీ కార్యసాంప్రదాయాలు బాగా పట్టుబడ్డాయి. అష్టాదశపురాణ సారాన్ని నీజీవితములో ఆచరించి చూపిస్తున్నావు. వామనుడు బలినియాచించాడు. విష్ణువు గజా సురుణ్ణి ప్రార్థించాడు. నీవు నన్ను యాచిస్తున్నావు ఎంతఅదృ

ష్టము ‘నావిష్ణుః పృథ్వీపతిః’ అనికదా మా ఆర్యోక్తి. ఇప్పుడు రవానాచేసేది పాతాళలోకానికా! స్వర్గలోకానికా!

అక్బ :— ప్రాణాలు తీయటానికికాదు రక్షించటానికి వచ్చాను.

తలనుమకుటంబు దాల్చిన ధరణిశేఖరుడను
ప్రజలనురక్షింప నిరతంబు పాటుపడును
ఎల్లనిముసంబు లాతని కదియెచింత
ప్రజలరక్షించు నాతడా ప్రభువు[illegible].

తాన్ :— అక్బరుసార్వభౌమా! నీ సేవ [illegible] చేసినను మన్నించి [illegible] క్షేమించితివే. మా అభివృద్ధికొఱకే. [illegible] ప్రోత్సహించావు తాన్ సేన్ అమరగానాన్ని సృష్టించి శాశ్వతకీర్తి [illegible] గానాలనే మహోదాశయముతోనే [illegible] మరణ[illegible]చావు. పాపము పుణ్యలోకాలలో హాయిగా [illegible]. హిందూ[illegible] మహమ్మదీయ వివాహాలు చేయించావు భ్రాతృ వాత్సల్యముతో రెండు జాతులు వృద్ధిపొందుతాయని.

మతఘోరయుద్ధాల మాన్పిరక్షింపగా
చాటించితివి [illegible]
హిందువుల్ ముదమొంద [illegible]
చూపించితివి పెండ్లి శుద్ధపథము
అంతఃపురాంగన లమిత మోదముజెంద
పెట్టించితివి పుణ్యపీఠిమెప్పుడో
అన్యోన్య కలహంబు లంతరింప నృపాల
సార్వభౌముడ నంచు చాటినావు
చేసితివి మేళ్ళు వివరించి చెప్పగలనె
వెన్నదలదన్ను హృదయంబు కన్నప్రజల
గోలెరక్షించు మమతయు బూనినృపాల

మనుసజేసెడి గుణతతి ! మానవత్వ
మున్నలోన్నత శిఖరాన ! నోప్పుచుండు
సార్థేరెవ్వరును నీకు ! సార్వభౌమ.

నృపాలా నీ హృదయమతి గంభీరమైంది. విషాన్ని అమృతమని చెప్పి అందరికి పంచిపెట్టి విమలయశాన్ని పొందే పటుత్వము నీ వాక్కులలోఉంది. భారతదేశమెన్నో యుగాలనుండి చేసిన పుణ్యమువలన నీ వంటిసార్వభౌముడు దాన్నిపాలిస్తున్నాడు.

అక్బ :— ఆస్థానప్రజలు నీ అమృతగానాన్నివిని ఆనందించాలని ఆరాట మొందుతున్నారు.

తాన :— పాపము తమరాజుతత్వమె ఋగని అమాయకులు. రాజేంద్రా చెప్పు. తాన్ సేన్ ఉన్మత్తుడై విషాదగీతాలు పాడుతూ వంచకు రాలైన తానీరాక్షసకృత్యాలను తలచుకొంటూ తనహృదయో ద్భూత దుఃఖాన్ని పిశాచగణానికి, వినిపిస్తూ శ్మశానవాటికలో సంచరిస్తున్నాడని. ప్రత్యక్షములోను తాని రూపాన్నిచూచి యేడ్వాలో శపించాలో తెలియక బాధపడుతున్నాడని. మానవ హృదయములో ప్రేమనాగే మార్గము తెలియక వృక్షలతాదు లను ప్రశ్నిస్తున్నాడని. రాళ్ళలోకూడ మార్దవత్వాన్నిచూచి మనుష్యులలో ఎందుకు సృష్టించ లేదని. భగవంతుణ్ణి ప్రశ్నిస్తు న్నాడని, చెప్పు. అప్పుడు తమనృపాలుడు గాయకశిరోమణికి - అతనివిద్యకిచ్చిన గౌరవ మర్థమవుతుంది.

ప్రకృతి నెచ్చట గననట్టి భయదనీచ
ఘోరగుణములు మానవకోటి నెటుల
సంక్రమించెనో తెలియక జడమయైన
ప్రకృతినే ప్రశ్నవైచుచు ! వనములందె
తిరుగునని చెప్పు బొమ్ము పృధ్వీశయిపుడె.

అక్బ:— మీ అమృత గానాన్ని వినాలని నా దుహిత—

తాన్:— తండ్రికి తగిన పుత్రిక కాదనుకొంటాను. లలితకళల కంఠప్రాశస్త్యమిస్తే సామ్రాజ్యాలు నిలబడవు. సంగీతయువతిని పదిసిలువుల గోతిలో పాతివైచి దివ్యసమాధిని కట్టినపుడె సామ్రాజ్యాలు వృద్ధిపొందుతాయి. పాప మమాయకురాల కర్థము కాలేదను కొంటాను. నచ్చచెప్పు సార్వభౌమా!

అక్బ:— ఆమె మీరాక కెదురు చూస్తోంది.

తాన్:— రానని చెప్పు. తాన్‌సేనుకు శాసించే నృపాలుడు పుట్టలేదని ఆమెకు తెలియదా?

అక్బ:— అక్బరు నృపాలుడు నేడు కుమార్తె దుఃఖాన్ని సహించలేక వ్రక్కలయ్యే హృదయముతో యాచించే దీనజనకుడు. అపకారము చేసి దాన్ని మరచిపోలేక పోయినప్పటికి తప్పుసరిగా కుమార్తెను రక్షించుకోవటానికి ఆత్మగౌరవాన్ని చంపుకొని యాచించే పాషాణహృదయుడు దీనుడు.

తాన్:— నేనువచ్చి చేయవలసినపని.

అక్బ:— దీపక్ రాగమునుపాడి ఆమె ప్రాణము రక్షించాలి.

తాన్:— అక్బరుసార్వభౌమా! ఎంతమంచిఆలోచన. దీపకరాగము నా చేతపాడించి నన్ను సమస్తబాధలనుండి దూరముచేయాలని చూస్తున్నావు. ఇంతకంటె మంచిస్నేహితుడు లభిస్తాడా! నమస్కారము.

అక్బ:— మీ అభిప్రాయము నా కర్థము కాలేదు.

తాన్:— మీ అభిప్రాయము నా కర్థమైంది. దీపక్ రాగము గాయకుల ప్రాణాలను హరిస్తుంది. కూతురువంక పెట్టి ప్రాణాలుతీయటానికి మంచియెత్తు వేసావు. ఇంతకక్షవహించటానికి నీకు నేనుచేసిన ద్రోహమేమిటి! తాన్ సేన్ నీవనుకొనినంత మూర్ఖుడుకాడు. సెలవు నమస్కారము.

అక్బ :—నా నిష్కల్మషహృదయాన్ని మీ రనవసరముగా శంకి స్తున్నారు.

తాన్ :—నీ కుమార్తె ఆనందముకొఱకు నా ప్రాణాలు తీయటము క్షమింపటానికి సాధ్యముకాని ద్రోహము. సామాన్యప్రజలు విని భరింపలేని భయంకరస్వార్థము. నృపులు ప్రజలసౌఖ్యార్థము ప్రాణాలర్పించటానికున్నారు కాని, తమఆనందముకొరకు ప్రజల ప్రాణాలు తీయటానికి కాదు. ఈ సంగతి జ్ఞాపకముంచుకో. నెత్తిమీద కిరీటము ధరించటము మా వంటి వారి ప్రాణాలు దీయటానికి కాదు రక్షించటానికి

ప్రజల రంజింపజేయుట ప్రభుని ధర్మ
మతని మకుటంబ దీనుల కండరక్ష
యవసరంబున్న బ్రాణాలు సమర్పించి
ప్రజలరక్షించునాతడే ప్రభువు కాని
వారి ప్రాణంబులను దీయువాడు నృపుడె.

అక్బ :—అయిన !

తాన్ :—భారత దేశము స్వార్థత్యాగానికి ప్రసిద్ధి కెక్కింది. మహాదాశయాలను ఆరాధిస్తూ ప్రాణా లర్పించటములోనే భారతీయులానంద మనుభవిస్తారు. సామాన్యుల జీవితాలలోనే స్వార్థము లేనప్పుడు సార్వభౌముల హృదయాలలో స్వార్థమింత ఘనీభవించి ఉండటము విచిత్రముగానే ఉంది. ప్రభూ ఈనీచ క్షుద్ర స్వార్థాన్ని భారతీయులు సహించలేరు.

అక్బ :—గాయకోత్తమా !

భారతీయులు మీరు భారతదేశాన
జన్మించి పెరిగిన సాధ్వియామె

సౌందర్యముగ్ధులై జగతి వీక్షించెడి
గాయకుల్ మీరలు కనకనూమె
సంగీతమర్మముల్ చాటి చెప్పగ నెంచు
భ్రాతలు మీరలు భగిని యీమె
వినగోర వినుగక వినిపించి సంగీత
శాస్త్రార్థముల దెల్పు చతురులీరు
మిమ్ము సంగీతమూర్తిగా మెచ్చి నిరత
మాత్మ బ్రార్థి... ముగ్ధ యీ యబలగాన
వచ్చి రక్షింప వేడెద బ్రభువు బ్రజల
బంధముల జూచి కాదు నా ప్రణతు లివియ

తాన్ :—అక్బరు సార్వభౌమా! నిజము వక్కాణించావు. నా సంగీతాన్ని గాఢముగా ప్రేమించి, వినాలని బాధపొందే యువతికి వినిపించటము నా ధర్మము. అనింద్య విరాజితమైన దిలేరాను రక్షించటము కళోపాసకుని విధి.

అక్బ :—ఈ వరమును స్వీకరించుటకు నేను సిగ్గుపడుతున్నాను.

తాన్ :—అవసరము లేదు. మహోదవకాశ మిచ్చినందులకు ధన్యవాదాలు. తానీ వియోగమువలన స్వల్పకాలములోనే తాన్ సేన్ మరణిస్తాడు. కృతజ్ఞత కల యువతికై విలపిస్తూ, ప్రాణాలు వదలటంకంటె నా సంగీతము వినాలని విలపించే యువతిని సంతోషింపజేస్తూ ప్రాణాలు పరిత్యజించటము మంచిదికాదా!

అక్బ :—ప్రభూ!

తాన్ :—నృపాలా! జ్ఞాపకముంచుకో! దీపక్ రాగము పాడినపుడు ఆరిపోయిన దీపాలు వెలుగుతాయి. అపుడు నా శరీరములో దుర్భరమైన తాపముతో మండిపోతుంది. వింతకాంతులను

వెడల్లుతుంది. అప్పుడు వైద్యులకు శ్రమయిచ్చి గురుకటా
క్షము నేన పవిత్రమైన యీ దేహాన్ని కలుషితముచేయవద్దు.

అక్బ: అతిసమర్థులైన వైద్యు లున్నారు. దేవతలతో పోరి అమృత
మైనా తేగల రసపుత్రవీరు లున్నారు.

తాన్:—ఆత్మస్తుతి కవసరములేదు. వైద్యులశక్తి కతీతమైంది.

అక్బ:—దీనికి విరుగుడు లేదా! వైద్యులు రక్షింపగలరనే ధైర్య
ముతో ప్రార్థించాను.

తాన్:—దీనికి విరుగుడు తానీ యెఱుగును. ఇం కెవరికి తెలియదు.
ఆ సన్యాసాచికి నా సమస్తవిద్యలు ధారపోశాను.

అక్బ:—అష్టకష్టాలైనా పడి ఆమెను పట్టి తెస్తాను. ప్రతిక్రియ చేయిస్తాను.

తాన్:—అక్బరుసార్వభౌమా! తానీహృదయములో ప్రేమ లేదు.
ప్రేమపుష్పాన్ని ఆమె గర్వముతో నేల విసిరి, కాళ్ళతో రాచి
వైచింది. ఆమె కరస్పర్శ నేను సహించలేను. ఆమె కంఠములో
కాలసర్పా లున్నాయి. ఆ ప్రయత్నము విరమించు లేతహృద
యము నా రాగాన్ని విని ఆనందించనీ నిరాశావీక్షిత హృదయ
ములోని బాధను తొలగించనీ. నీవిషాదగీతాలతో విసిగి చికా
కుచెందే ప్రకృతిని శాంతించనీ. ఆనందించనీ.

> యౌవనంబున దర్పించి యథమవృత్తి
> సంచరించిన వేశ్య యీ జాణ తానీ
> ప్రాణముల నేల నర్పింపవలయు నచట
> ప్రేమ లేనట్టి తలమున వెట్టినగుచు.

కాని ఒకమాట.

అక్బ:—ఏమి ఆజ్ఞ!

తాన్:—అలకాపురిని తిరస్కరించే సౌధాలు నిర్మించటంలో సంతోష
మొందే మొగలుసామ్రాట్! ఈ గాయకుని స్మరించి తరిం

చాలనే పిచ్చిసమ్మతముతో సమాధిని నిర్మించవద్దు. ప్రకృతిని ప్రకృతిలో కలవనీ !

వలదు నిర్మింప భవనంబు ! ప్రజలు మెచ్చి
స్తుతుల నర్పింపదగు పని ! ధూర్త తాని
చేయు మోసాన నశియించి ! చేయనైతి
వ్యర్థముగ రాళ్ళభవనాల ! వలదు కట్ట.

అక్బ :—కాని—

తాన్ :—ఈ కళాసామ్రాట్టుప్పర్థను సహింపడు. సెలవు నృపాలా !

అక్బ :—(విచారము సూచించును)

తాన్ :—నీవు పోయి ప్రయత్నముచెయ్యి. రేపు దర్బారులో దీపక్ రాగము. ఆరినదీపాలు వెలగటము. తాన్‌సేన్ దీపముగ మారిపోవటము.

గే య ం.

రాగములేని కంకాళములో
రాగతరంగము లేచునా !
అనురాగంబే
అరుదగు హృదిలో
ఆనందం బిక
మొలకలెత్తునా ?
రాగములేని కంకాళములో
రాగతరంగము లేచునా !
దీపకరాగము
దివ్యజ్యోతులను
దీప్తి మెరగా
వెలిగించునా

రాగము లేని కంకాళములో
రాగతరంగము లేచునా!

నా దీపకమే
నా హృద్దీపిక
నినుపచేతులను
ఆర్పునా

రాగము లేని కంకాళములో
రాగతరంగము లేచునా?

అక్బ:—(దీనముఖముతో) సెలవు!

(తెర ప్రాలును)

# తాన్ సేన్

## దృశ్యము తొమ్మిది

అక్బరు ప్రత్యేకస్థానమండపము.

(దిలేరా, ఆస్థానగాయకుడు, విద్యానందుడు, విజయ ప్రవేశించుదురు.)

దిలే:—పెద్దలు మీరు కాని, మీ వయస్సుకు, మీ గుణములకు సంబంధము లేదు. వయస్సు వృద్ధిచెందుచున్నకొలది గుణము వక్రమార్గమును పట్టుచున్నది.

విద్యా:—అమ్మగారు పొరబడుతున్నారు. మా గురువుగారు సార్వభౌమునితో ముందరే చెప్పారు. దీపక్‌రాగము గాయకుని భస్మముచేస్తుందని. కాని, ధన్వంతురులను మించిన వైద్యులున్నారని దేవతలలో పోరి, అమృతము తేగల రసపుత్రులున్నారని గర్జించారు.

దిలే:—నాతో ఎందుకు చెప్పలేదు. రోగము కుదురుతుం దని చెప్పారు కాని, వైద్యుణ్ణి చంపుతుం దని యెందుకు చెప్పలేదు. శ్వశుర స్వార్థాన్ని తృప్తిపరచటానికై, హృదయాన్ని దహించటానికి చెలరేగే అసూయాగ్నిని చల్లార్చటానికి నన్ను ప్రపంచజ్ఞానము లేని మూర్ఖురాలను బలివేశారు.

విజ:—అసూయ కవసరము లేదు. అరణ్యాలలో ప్రతివృక్షాన్ని చూచి 'తాన్' అని గొల్లుమని యేడ్చి, పిచ్చి పిచ్చిపాటలు పాడే బైరాగిని ఎవరు గణిస్తారు? అసూయతో వీక్షిస్తారు.

దిలే:—నోరు ముయ్యి. స్త్రీజాతి కంతకు అపఖ్యాతి తెచ్చావు. నీవు వేశ్యవే కాకపోతే ఆ జరిగిన పరాభవానికి విషము త్రాగి చచ్చి ఉందువు. గూఢచారులు చెప్పలేదనుకొన్నావా?

విజ :—తాము కల్పించినకథను గూఢచారులద్వారా లోకములో వెల్లడించినమాత్రాన సత్యము తారు మారుకాదు.

విద్యా :—విజయా ! అమ్మగారితో చర్చ వూన కెందుకు ? తాన్ సేను తన సంగీతములో నిన్ను శిలాప్రతిమగా మార్చి, మళ్లీ దయ దలచి యథారూపానికి మార్చాడని తాన్ సేనుమీద వారి కున్న గౌరవాన్ని సూచిస్తున్నారు. సంగీతానికి చింతకాయలు రాల వసి లోకానికి చాలకాలముక్రిందటనే తెలియును.

దిలే :—నోరెత్తావంటే సేవకులచేత గెంటిస్తా, జాగ్రత్త. శిష్యుని జగ ద్వ్యాఖ్యాతసి విని ఆనందించి ఆశీర్వదించిన గురువు అసూయా గ్రస్తుడై శత్రుపక్షములో చేరి ప్రతిభావంతుడైన శిష్యుణ్ణి హత మార్చటానికి ప్రయత్నిస్తున్నాడంటే—

విద్యా :—అమ్మగారు విద్యావంతులను అవమానిస్తున్నారు.

దిలే :—అవమానించటమే కాదు. ఆస్థానగాయకు లని వీరిని వేశ్య యైనా స్త్రీ యని ఈ విజయను, పూజ్యపాదుల కఠోరాభ్యాస ముచేసీ అదృష్టము పట్టినందులకు మిమ్ములను సైరించాను. లేకపోతే యీ కుట్రకు మీ తల లెగిరిఉండవలసింది.

(ఇంతలో తాన్ సేను ప్రవేశించును.)

దిలే :—ప్రభూ ! చేతులు జోడించి ప్రార్థిస్తాను. ఆ ప్రయత్నమునుండి మానండి. నా అజ్ఞానాన్ని క్షమించండి !

సకల నాదరహస్యముల్ సంగ్రహించి
ప్రకృతి శాసించి, దీనుల బాధ లన్ని
మాయజేసెడి మహితాత్మ ! మరణ మేల
మానుమా యత్నము లిదే నమస్కృతంబు.

తాన్ :—దిలేరా ! నా హృదయములో నిగూఢముగా ఉండి. బాధి స్తున్న వాంఛను నెరవేర్చనీ !

దిలే :—వంచకులు, స్వార్థపరులు, సంకుచితహృదయులు మీ కీర్తిని విని, సహింపలేక చేసిన మోస మిది. మేల్కొనండి. ఆత్మరక్షణముతో ప్రపంచాన్ని ఉద్ధరించండి.

తాన్ :—దిలేరా ! తాన్‌సేన్ తన నిశ్చయాన్ని మార్చుకొనే వ్యక్తి కాడు. చిన్నపిల్లవు కనుక, నీ కర్థముకాదు తాన్‌సేన్ హృదయాన్ని దహించే తీవ్రాగ్నిప్రభావము. ఆతనిలో బయలుదేరిన నిరాశను సాధ్యమైనంతత్వరలో నిర్మూలించకపోతే లోకమే ఆ అగ్నికి భస్మమైపోతుంది. తాన్‌సేన్ జీవించి, ఆనంద మనుభవింపలేడు.

దిలే :—కాని, క్షుద్రస్వార్థానికి మీ వంటి అద్వితీయవ్యక్తులను బలి యిచ్చాననే బాధ నన్ను జీవితమున్నంతవఱకు పీడింపదా ?

తాన్ :—తాన్‌సేను భారతీయుడు. పరుల సౌఖ్యానికి ప్రాణాలర్పించటము భారతీయుని ప్రథమధర్మము. నీ వంటి లేతహృదయాలానందమనుభవించటానికి నా జీవిత మర్పితమైందంటే అంతకంటె నాకు కావలసిన దేమున్నది ?

దిలే :—(వచ్చుచున్న అక్బరు చెంతకేగి) తండ్రీ ! నీవైన వారింపవా! సంగీతము వినాలనే క్షుద్రవాంఛతో ఇంతదారుణకృత్యము సాధించటము లోకము సహిస్తుందా !

అక్బ :—(దిలేరాను దగ్గఱకు చేర్చి) అమ్మా ! తాన్‌సేన్‌తత్త్వము నీ కర్థముకాదు.

దిలే :—ప్రార్థించు. తత్త్వము మారుతుంది.

తాన్ :—దిలేరా ! పెద్దలప్రయత్నాల కడ్డువచ్చే అభ్యాసము మార్చుకో

దిలే :—ప్రభూ ! పెద్దలు అజ్ఞానములో పడి బాధపడుతూ రత్నానికి, బొగ్గుకు భేదము గణించకుండా, బొగ్గును పెంపొందజేయటానికి రత్నాన్ని చితకగొట్టుతుంటే పిల్లలు సహించవలసిందేనా ?

వయసు మరలినమాత్రాన ప్రాజ్ఞుడగునె
సత్యదేవత వీక్షించి జంకులేక
చాటి వలసినశ్రమవొందు చతురుడగునె
యర్భకుల కెట్లు నాయకుడగును వాడు.

అక్బ—దిలేరా! తాన్‌సేన్ నిశ్చయాన్ని మార్చటానికి బ్రహ్మకైనా తరముకాదు

దిలే:—ప్రార్థిస్తే స్థాణువైనా చలిస్తుంది.

తాన్—దిలేరా! ఈ అవినయాన్ని భారతీయులు క్షమించరు. ప్రేమధిక్కారాన్ని క్షమించదు. ఈ అవినయమువలననే తానీ భ్రష్టురాలైంది. ఇంకొకమాట నేను క్షమించను.

(అని తాన్‌సేను పాటప్రారంభించును)

గే య ం.

వెలుగదే యీ జ్యోతి
వినదె నాదముఖ్యాని
చీకటుల బాపేటి
చిన్మయముగూర్చేటి
జ్యోతిర్మయంబైన
యీదివ్యదీపిక
వెలుగదే యీ జ్యోతి
వినదె నాదముఖ్యాతి!!
వీణానినాదమే
వెలుగునిడలేదే
మురళీరవంబులే
ముద్దు జ్యోతిగాదే

వెలుగదే యీ జ్యోతి
వినదె నాదముఖ్యాతి !

ప్రభువులు ప్రజలు మురియంగ
దివ్యదీపికలు వెలుగంగా
ఆరినజ్యోతి యాడంగా
దీపికరాగము పాడంగా

వెలుగదే యీ జ్యోతి
వినదె నాదముఖ్యాతి !

దిలే :—ఆర్యులు నిష్కల్మష హృదయములో ఆరాధించే మావ్యావా హానా ? నిన్నారాధించే భక్తుడు ఒక బాలికను సంతోషింప జేయటానికి యత్నిస్తున్నాడు. సాధ్యమైనంతవరకు సంరక్షించు లేతహృదయములోంచి వచ్చిన ప్రార్థనను నిరాకరింపవని ఆశిస్తున్నాను.

వేశ్య చేసిన ద్రోహాన విసుగుజెంది
స్వల్పవాంఛను నెరవేర్ప సాహసించె
ప్రాణములనొడ్డి గాయకవరుడు భార
తీయు డాచారవంతుండు దేవదేవ !
ప్రోవుమా వేడుచుంటిని ముగ్ధ నగుట.

(ఆరిన దీపాలు వెలుగును)

తాన్ :—(నిమీలితనేత్రుడై) అక్బరుసార్వభౌమా ! నీ కోరిక నెరవేరింది. దిలేరా ముఖము ఆనందముతో తాండవిస్తుంది. తాన్‌సేన్ ప్రాణాలు పరలోకయాత్ర సాగిస్తున్నాయి. (గద్గదస్వరముతో) కాని

అక్బ :—(విహ్వలితచిత్తముతో) ఆజ్ఞాపించు ప్రభూ !

తాన్ :—తానీ కనబడిన తాన్‌సేన్ నీ కృతఘ్నతవలన బలియైనాడని చెప్పు. ఆ కన్నీరు భూమిపై పడకుండ ఆమె శిరోజాలే భరించేటట్టు చెయ్యి. ఈ ఉపకారము నీవు నాకు చెయ్యాలి.

అక్బ :—తానీ కృతఘ్నురాలు కాదు.

తాన్ :—చర్చించి నిర్ణయించటానికి సమయము లేదు. మృత్యుదేవత భయంకరరూపముతో వచ్చి, నృత్యముచేస్తోంది. ఆనందపారవశ్యములో రాగ మందుకొమ్మని బలవంతముచేస్తోంది.

దిలే :—(ఏడుస్తూ) ప్రభూ! మృత్యుముఖములో ప్రవేశిస్తున్నారు! ఈ పాడు దిలేరా ప్రాణాలు తీసిందా!

తాన్ :—(గంభీరస్వరముతో) పరలోకప్రయాణము చేసేటప్పుడు గద్గదస్వరము కాని, బాష్పపూరితనేత్రాలు కాని, అక్షింతవ్యాలు.

అక్బ :—ప్రభూ!

తాన్ :—అవసరము లేదు. వైద్యులశక్తి కతీతమైంది.

అక్బ :—తానికి వర్తమాన మంపుతే.

తాన్ :—పరలోకప్రాప్తికి విఘ్నము భావిజీవితములో నీచాతినీచ జన్మప్రాప్తికి సాధనము వద్దు. (అని వెడలిపోవును)

దిలే :—నాన్నా! నా హృదయములో దుర్భరాగ్నిని ప్రవేశపెట్టారు.

అక్బ :—అక్బరుహృదయ మెన్న డెఱుగనిబాధ ననుభవిస్తోంది. ప్రతిక్రియ తెలియనిబాధ. ప్రతిక్షణము నాడీగ్రంథులను బూదిచేసే దుర్భరావమానము.

దిలే :—తాన్‌సేన్ తాపము మనల నాక్రమించింది అనుకొంటాను.

అక్బ :—హృదయాల కుండే సన్నిహిత సంబంధము.

మతముల దాటి, దేశములమాట దలుపక, సాంప్రదాయముల్
చతురత జర్యజేయక. విచారముసేయక దేహకాంతులన్,
పతనము చింతజేయక సుపర్వులు మెచ్చువిధాన చిత్తము
ల్లతుకును రక్తి వింతయగు నద్ది పరాత్పరు డన్న దోసమే.

(తెర వ్రాలును)

# తాన్ సేన్

## దృశ్యము పది

(అరణ్యభాగమున తానీ పరిభ్రమించుచు)

"పుష్పముల్ వికసించి, మోదింప వాసనల్,
సౌందర్య మే మూల జనియె దాగ
చంద్రుండు పెంపొంది జగముల నవ్వింప
జ్యోత్స్నపీయూషంబు లొడిగె నెచట
భూమిజముల్ స్వర్గభూమిని రాపాడ
ఫలపుష్పపత్రముల్ తొలగె నెటకు
మేఘముల్ నభమున మెఱసి వర్షింపగ
చంచల లే మూల వంచె తలలు
గాయకాగ్రేసరుండు, లోకైకవీరు,
డతులగుణనిధి తాన్సేను డమరకీర్తి
పొంద తానీ యరణ్య మూల
దాగి జీవింపనేల సత్యంబు కలదె.

ఈ కఠోరశాసనము దుర్భరమైందే తాన్సేన్ అభివృద్ధికి తానీ దూరముగా ఉండాలా! పుష్పాభివృద్ధికి పరిమళము దూరముగా ఉందా సౌందర్యము దాన్ని వదలిపోయిందా! లతలతో సంయోగము కల్గి పుష్పము చిరుగాలికి ఆనందిస్తూ శిరఃకంపము చేస్తూ ఆలాపిస్తుంటే తానీ తాన్సేనును ఎందుకు వదలాలి? నా కర్థముకావటములేదు. కాని, విజ్ఞానపరమావధిచూచిన

అక్బరు చెప్పినదాంట్లో సత్యముంటుంది. తాన్‌సేన్ వియోగ మువలన నా నృత్యము కృష్ణపక్షచంద్రునిమాదిరి తగ్గిపో తుంటే అతనికళ యెల్లాగ వృద్ధిపొందుతుంది. ఇంతకు తాన్ సేన్ నా ఆశయాన్ని అర్థముచేసికొంటాడా! కృతఘ్నురాలని నిందించి శపిస్తాడా! వచ్చేటప్పుడు చెప్పి వస్తే బాగుండును. ఆగ్రహించి అన్యస్త్రీ కరస్పర్శచేస్తే తాని జీవించగలదా! ఆ ఊహే దుర్భరముగా ఉంటే – మా తాన్ సేన్ నా హృద యాన్ని అర్పించి ఆరాధించిన తాన్‌సేన్ అక్బరుకంటె అత్యు న్నతస్థాన మిచ్చి నేనారాధించిన తాన్‌సేన్ – నన్ను పరిత్య జించి అన్యస్త్రీని స్వీకరింపగలడా! అదుగో! నా తాన్‌సేన్! అగ్రస్థానము వహించాడు, అక్బరుసార్వభౌముడు చెప్పినమాట నిజమే. ఆకాశముమీద స్వేచ్ఛగా సంచరిస్తూ మీ యిష్టము వచ్చినట్లు విధి నిషేధాలు లేకుండా హాయిగా పాడే ఖేచరము లారా! వినండి, మా తాన్‌సేన్ గాయకాగ్రేసరుడు. అక్బరు ఆస్థానములో గాయకస్థానాన్ని ఆక్రమించి, సర్వజనసంస్తుత్యుడై ప్రకాశిస్తున్నాడా, నవ్వుతున్నారా, అసూయ. ఒకేవృత్తిలో సంచరించేవాళ్ళకింత అసూయ యెందుకో?

ఒక్కకులమున జన్మించియున్న ధాటి
పండితుని గొప్ప తిలకించి మండిపడును
క్షుద్రమానవుడేని నసూయపడడు
పండితున కేల వ్రాసె నీ బాధ ధాత.

ఈ పుష్పాలు దశదిశల తమ పరిమళము వెదజల్లి, భ్రమరా లను ఆకర్షించటమువలన మహాగర్వముతో విఱ్ఱవీగుతున్నాయి కాని, శాశ్వతముగా భ్రమరాలను బంధించే శక్తిలేదు. మా

తాన్‌సేన్ నృపాలురను, సామంతులను, గాయకులను తన మధురకంఠముతో దాసోహముచేసి శాశ్వతపుబానిసలుగా చేస్తున్నాడు. అతని మధురకంఠాన్ని స్పృశించే అధికారము మీకు లేదు, ముత్యాలు అతనికంఠాన్ని వరించాయి. అదుగో! మేఘము గర్జిస్తుంది, మెఱుపులు ప్రకాశిస్తున్నాయి. ఈ సమయములో తాన్‌సేనే ప్రక్కన ఉంటే—

(తాన్‌సేన్ ప్రవేసించును.)

తాన్ :— తానీ వంచకురాలు. ప్రాణాలుహరించే పటుత్వము దాన్కి కుంది. అది వేశ్య, ప్రేమించి కానుకగా ఇచ్చిన హృదయకుసుమాన్ని గర్వముతో తునియలుగాజేసి వాయుదేవుని కర్పించి, ఇతరుల అవమానములోనే తన గొప్ప ఉందని గర్వించే మూఢురాలు - దాహము - దాహము.

తానీ :—ఎవరు? తాన్‌సేన్! ప్రభూ! తానీ వంచకురాలు కాదు ఆమె తన హృదయాన్ని కళ కర్పించి వివశయై నీ అభివృద్ధికై నిరంతరము భగవంతుని ప్రార్థిస్తూ, స్వీయసౌఖ్యాలను త్యజించిన యువతి - వంచకురాలు కాదు.

తాని హృదయాన చెలరేగి దమన మెఱుగ
నట్టిబాధల ప్రశ్నింప నర్థమగును
తాని యెవ్వరో, వేశ్యయో, దయిత యగునో,
హృదయమున నిల్చు నీవు వీక్షింపలేవె?

తాన్ :—నీవు వేశ్యవు. నీ చేతి నీళ్ళు నా దాహాన్ని తగ్గించవు. అవి విషతుల్యము. పో! తానీ పో, నీవు కృతఘ్నురాలవు.

తానీ :—ప్రభూ! తన హృదయాన్ని నీకు కానుకగా ఇచ్చి నీ సేవ చేసే దాసురాలు తానీ, ఆమె కృతఘ్నురాలు కాదు.

తాన్ :—అక్బరు వద్దు. వ్యర్థప్రయత్నాలు మాను. ఆ వంచకురాలు నన్ను ఖూనీచేసింది. మోసము చేసి గొప్పతనము చూపించు కొంది. ఇంక నేను బ్రతికి లాభములేదు.

తానీ :—ప్రభూ ! ఆ కపటసామ్రాట్ మాటలను నమ్మి నిన్ను పరిత్య జించాను. నీ అభివృద్ధిని వాంఛించి, సాధ్యముకాని త్యాగము చేసి అనుక్షణము రౌరవబాధలను అనుభవిస్తున్నాను.

తాన్ :—దిలేరా ! తాన్‌సేన్ హృదయములో జాజ్వల్యమానముగా దహించే వియోగాగ్నిప్రభావము తెలియక తాన్‌సేన్ జీవించా లని కోరుతున్నావు. నన్ను మరణించనీ ! నాలో ఉన్న నిరా శను, నా రక్త మాంసాలతో పోషించాను. అర్థరాత్రులు శ్మశానవాటికలో భూతప్రేత పిశాచములతో సమముగా ఆడించి, దాన్ని పెంచి పెద్దదానినిచేసాను. ఇక మృత్యుదేవత కిచ్చి వివాహముచేసి నన్ను తృప్తిచెందనీ !

తానీ :—ప్రభూ ! నా తప్పు క్షమించు ! అజ్ఞానములో ఆచరించిన అపరాధాన్ని క్షమించు. నన్ను దరికిచేర్చి పాలించు నీ పాదాల లంటి ప్రార్థిస్తున్నాను.

తెలియనేరక నా వంటి ధీవిశాలు
తత్త్వమును, సార్వభౌము సత్యాత్ముడంచు
నమ్మి వంచింపబడితిని, నా యఘంబె,
సైచి రక్షింపుమా దేవ, సతిని పతియె
సైపకుండిన గతి యేమి జగతి చెపుము .

(అని పాదములమీద వ్రాలును)

తాన్ :—అక్బరుసార్వభౌమా ! నేను జీవించేమార్గము ఆ రాక్షసికి తెలుసును. ఈ తాపానికి విఱుగుడు ఆ రాక్షసికి బోధచేశాను. తానీ కృతఘ్నురాలు. ఆమె కరస్పర్శ నేను సహించను. అది

నాకు కాలకూటవిషము. ఆ కంఠస్వరములో నా స్వర్గాన్ని కూలద్రోసేపాపము ఘనీభవించి ఉంది ఆమె వేశ్య.

తానీ :—ప్రభూ ! నేను వేశ్యను కాను. ప్రేమప్రతిమపాఠాన్ని మీ వద్ద నేర్చి, ఈ హృదయకుసుమాన్ని మీ పాదాలచెంత అర్పించిన అర్ధాంగిని.

తాన్ :—దిలేరా ! తానీ నీ వంటి కోమలహృదయ కాదు. ధనార్జనకై హత్యలు చేయుటానికి జంకని వేశ్య. క్షుద్రకులములో జన్మించిన నీచ. గురుధిక్కారముచేసి నే నింట లేనప్పుడు పారిపోయిన లంపట - దాహము - దిలేరా - ద్రోహము.

తానీ ;—ప్రభూ ! కన్నువిప్పి చూడు. నీ భయంకరదృష్టితో నన్ను భస్మముచెయ్యి. ఆ క్రూరాత్ముడు - ఆ వంచకుడు - అక్బరు హృదయ వ్రక్కలయ్యేటట్టు యేడుస్తూ పోయిన నా కథ చెప్పలేదు. ప్రభువున కాగ్రహకారణమదే ! ప్రభూ ! నా హృదయాన్ని చీల్చి చూడు - ప్రత్యణువులోను నీ రూపాన్నే - తానీ తాన్ సేనుల అర్ధనారీశ్వరరూపాన్ని ఆనందముతో అనుభవిస్తోంది. ప్రభూ ! నీ ఆగ్రహాన్ని భరించగలను కాని, నిర్లక్ష్యాన్ని సహించలేను.

తాన్ :—అక్బరుసామ్రాట్ ! నా కడసారి ప్రార్థన దాన్ని నిరాకరించకు. వైద్యు లీ రోగాన్ని కుదర్చలేరు. పనూాధ్యప్రయత్నాలు విరమించు. ఈ తాన్ సేన్ విషాదగీతాలు విని, భారతదేశము నిష్కళంకప్రేమను సాధించలేదు. గురువు శిష్యురాలిని గాఢముగా ప్రేమించి తన పవిత్రవిద్యను విశాలహృదయముతో నేర్పలేదు.

తానీ :—ప్రభూ ! లోకము సంపూర్ణముగా అర్థముచేసికొంది. తాన్ సేనుకు తమ హృదయాలలో ప్రజలు ప్రళయకాలపర్యంతాశాశ్వ

కీలలుకూడ బూడెచేయలేని సౌధాలను నిర్మించారు. ఈ తుచ్ఛ పాదుషా ఈ నరరూపరాక్షసుడు – ఈ వంచకుడు తన పైశాచికహస్తాలతో సమాధిని కట్టవలసిన అవసరములేదు. ఈ దీను రాలి ప్రార్థనను విని, కనులిచ్చి చూడు నాథా!

తా:— వేశ్య సతియైనా మానవజాతికి చెందింది. ఆ జాతికూడా ఈ అమానుష క్షుద్ర నీచ కుటిలహృదయరహిత పైశాచిక కృత్యాన్నివిని భరించలేదు కనుక సమాధినికట్టి ఈవిషాదాంత నాటకాన్ని జ్ఞాపకముచేసి ప్రజలను శిక్షించవద్దు నాయనా!

తాసీ:— గాయకశిరోమణీ! మీ పవిత్రజీవితమువలన వేశ్యాకులములో సంపూర్ణపరివర్తనము కల్గింది. మిమ్ములను మృత్యువు సమీపించలేదు.

తా:— లాభములేదా దీపక్ రాగము విరుగుడు నాకు తెలుసును. కాని నేను చెప్పను. నాకు జీవించాలనే ఆశలేదు. నా తాసీ నాది కాదు. ఆమె భరింపరాని పాపముచేసింది. తాసీకి తెలుసును కాని, ఆమె చెప్పదు. నేను జీవించవలసిన అవసరమామెకు లేదు. నేను జీవించటమే ఆమె ఆనందానికి అడ్డుఅని భావిస్తోంది. ఈ వార్త విని ఎంతో సంతోషిస్తుంది.

తాసీ:— ప్రభూ! తాసీని మీ రర్థముచేసికోలేదు. మీ రభివృద్ధికి వస్తారనే పిచ్చినమ్మకముతో మీ వియోగాన్ని భరించి మృత్యుదేవతతో అనుక్షణము పోరాడుతున్నాను. ఆత్మహత్య చేసికోలేక కాదు. అభివృద్ధికి వచ్చి ప్రపంచసంస్తుతులలో ఉన్నతుడైన తాన్‌సేనును చూచి నా నాథుడే అని ఆనందించాలనే అభిలాషతో, ఆశతో జీవిస్తున్నాను. ఆ ఆశలోనే అక్బరును, ఆతని సంపదలను తృణప్రాయముగా చూచాను. ఐనా, నా త్యాగాన్ని నీ వర్థముచేసికొనకపోవటము నా ప్రారబ్ధమే.

తాన్ :—దాహము - దాహము - నాలుక లాగుకొనిపోతుంది. మృత్యుముఖములో ప్రవేశిస్తున్నాను. దిలేరా! మీ భగవంతుణ్ణి ప్రార్థించు, తానీవంటి శిష్యురాలు మళ్లీజన్మలో లభించకుండా! దిలేరా భగవంతుడనుగ్రహిస్తే నీ వంటి శిష్యురాలు మళ్లీజన్మలో నాకు లభించాలి. దిలేరా - దాహము - మంచి నీళ్ళియ్యి! (త్రాగుట అభినయించి) ఇది తానీ యిచ్చుకొన్న నీళ్ళు - విషము— (అని పడిపోవును)

తానీ! —హా నాథా! — (అని కూలిపోవును)

(యోగి ప్రవేశించును)

గే య ం.

కటికిచీకటియె కన్నుల పండువ
గూర్చె వెన్నెల యగుగాదా!
యేల నిరాశా! యీ గతి మనసా
ఈశ్వరులీలల నిదియె తమాసా!

మంచుటెండలు మటుమాయంబై
తొలకరి చినుకులు తోషంబిడవా!
ఏల నిరాశా! యీగతి మనసా!
ఈశ్వరులీలల నిదియె తమాసా!

కారుమబ్బులే క్రమ్మినగానీ
శంపాలతలూ సమ్మదమిడవా!
ఏలనిరాశా! యీ గతి మనసా!
ఈశ్వరులీలల నిదియె తమాసా!

సుఖమూ దుఃఖము సమ్మిళితంబై
బ్రతుకు బాటలు యగుగా

ఏల నిరాశా! ఈగతి మనసా
ఈశ్వరలీలల నిదియె తమాసా!

(తానిని చూచి నీళ్ళు జల్లి లేపును)

తానీ:—దేవతలారా! నీకైనా దయలేదా! సంగీతసామ్రాట్ దాహముతో చనిపోతుంటే రక్షింపలేరా! (యోగిని చూచి పాదములపై బడి) యోగిపుంగవా! రక్షించు, సంగీతసామ్రాట్టును మృత్యుముఖమునుండి రక్షించు. తానెప్పూసిన కర్తియైన అక్బరు కావించిన హత్యనుండి భారతీయుణ్ణి రక్షించు.

యోగి:—అమ్మా! భయపడకు. అది మృత్యువు కాదు. దీపక్‌రాగమునలన వేడిమి. (చూచి) ఎవరు - తాన్‌సేన్ - (యోగిదృష్టిని చూచి) తాపమునలన మాడిపోవలసినదే కాని, కోమల హృదయమునుండి వెల్వడిని ప్రార్థన మీతని రక్షించినది

తానీ:—ప్రభూ! ఈ తాపము తగ్గేమార్గము లేదా.

యోగి:—నెల్లకినాన్ని! లేకేమి! దుఃఖావేశములో మరచిపోయావు. కాని, మేఘరంజని పాడు.

తానీ:—ప్రభూ! నేను దుఃఖవివశను. అపశ్రుతులతో రాగము భ్రష్టమౌతుంది.

యోగి:—భయములేదమ్మా! పాడు.

(తానీ పాడును)

గే యం,

రావేల రావేలరా నీరదుడా!
రావేల రావేలరా!
పసిడిపళ్ళెములతో పడతులెల్లరు నీకు
భవ్యహారతులు నా పట్టి [illegible]

రావేల రావేలరా నీరదుడా!
రావేల! రావేలరా!
చల్లనీ నీ నీరు సమ్మోదం బీయగా
యెల్లలోకాలకు యీవె సుఖదాతవురా!
రావేల రావేలరా నీరదుడా
రావేల! రావేలరా!
మెఱుపుకన్యలతోడ మురుపు చాలించరా
మొరాలకించరా! ముదము చేకూర్చరా!
రావేల రావేలరా నీరదుడా
రావేల రావేలరా!
మేఘరంజనియైన నా పాటనే వినరా!
హృదయాగ్ని చల్లార ఉత్సాహమీయరా!!
రావేల రావేలరా! నీరదుడా
రావేల రావేలరా!

తాన్ :—(స్మృతినొంది) గురువర్యా! నమస్కారము.

యోగి :—నాయనా, గుర్తు పట్టితివా!

తాన్ :—గురువును మరచి తాన్‌సేన్ జీవింపగలడా (తానీని చూచి) ఈ అమరజ్యోతి యెవరు?

యోగి :—మరచితివా నాయనా, నీ శిష్యురాలు!

తాన్ :—ప్రభూ కాదు నాకు శిష్యురాలు లేదు. ఈమె నా శిష్యురాలు కాదు.

తానీ :—(పాదములపై బడి) ప్రభూ! గుర్తుపట్టలేదా? నేను తానీని.

తాన్ :—(ఆగ్రహముతో) తానీ! అక్బరుఆస్థానములో నృత్యము చేస్తూ ఉదరపోషణముచేసే తానీయా! వేశ్యాకులములో జన్మించి, నన్మోసి వారి గొంతులు కోసేనేర్పు సంపాదించి

జీవించే తానీ నీవా! మహాయోగిని సేవించి, ఆ మహాత్ముని సత్కృపచే సంపాదించిన విద్యను స్వీకరించటానికి అర్హతగల శిష్యురాలవు. నీవు వేశ్యవు. అగ్రవర్ణములో జన్మించిన తాన్ సేన్ పేరెత్తటానికైనా నీ కధికారము లేదు, పో!

యోగి :— శాంతించు నాయనా! కళోపాసకున కంత ఆగ్రహముండ గూడదు. భయంకర సర్పాలలోకూడా మాధుర్యాన్ని, గీతాన్ని, సౌందర్యాన్ని వీక్షించటములోనే కళోపాసకుని గొప్పతనముంది.

సకలవస్తుతతిని సౌందర్య మెవ్వడు
గాంచు నతడె కలియుగాయకుండు
ఆగ్రహంబు వదలి యాత్మావ త్తని చూడ
మధురరవములెల్ల సుధను జల్లు.

తానీ :—ప్రభూ: నేను పాపాత్మురాలను, వేశ్యను. తుచ్ఛధన మపేక్షించి, గురువర్యుని గుండెలను ప్రీగజేసిన లంపటను. సెలవా!

యోగి :—పిచ్చిపిల్లా! సత్యము తెలుస్తే ఈ తాన్ సేన్ నీకు సాష్టాంగ నమస్కారముచేసిఉండును. అదుగో, మాటలోనే అందుకొన్నాడు. అక్బరు సార్వభౌముడు.

(అక్బరు ప్రవేశించును.)

తానీ :—అక్బరుసార్వభౌమా! నీ ఆస్థానాన్ని వదలి వచ్చానని ఆగ్రహించి కక్షసాధించాలని ఇంత నీచముగా ప్రవర్తిస్తావా! నీలో మానవత్వ మింతన్యూనమైందా! ఆ కక్ష మనస్సులో ఉంచుకొని, తాన్ సేన్ వంటి మహాత్ముణ్ణి వియోగాగ్నిలో మాడ్చి మాడ్చి చంపి, తానీకి తీరని కళంక మంటగట్టావని నేను కలలోనయినా అనుకోలేదు. ఇంత నీచహృదయముగల

నీవు పవిత్రాశయాలు గల భారతభూమిని శాసిస్తుంటే భగవంతు డెల్లాగ సైరిస్తున్నాడు ?

యోగి :—అమ్మా ! శాంతించు ! అక్బరు సార్వభౌమా ! తాని వెడలిపోయేటపుడు నీతో ఏమి చెప్పింది ?

అక్బ :—హృదయము వ్రక్కలయ్యేటట్లు ఏడుస్తూ వెళ్ళానని చెప్పమంది.

యోగి :—తాని వెళ్లిపోవటానికి కారణము ?

అక్బ :—తాని వియోగమువలన తాన్‌సేన్ సరస్వతీసేవచేసి, కళాభివృద్ధి కావిస్తా డని నే నిచ్చిన సలహా.

యోగి :—విన్నావా తాన్‌సేన్ ? ఇపుడు తాని కృతఘ్నురాలా ! అక్బరుసార్వభౌమా! తాన్‌సేనుతో నీ వా మాటలు చేప్పావా?

అక్బ:—తాన్‌సేన్ నా కవకాశ మివ్వలేదు తాని వెళ్ళిపోయిందన గానే ఆతని హృదయములో తుఫానుబయలుదేరి ప్రకృతిని ప్రకంపించింది. ఆ ధాటికి నేను నిలవలేకపోయాను

యోగి :—తాన్‌సేన్ నీ సందేహాలన్నీ తొలగిపోయాయా ? తానీ ! నీ వే మంటావు ?

తానీ :—(తల వంచును)

యోగి :—అక్బరుసార్వభౌమా ! తానీ తాన్‌సేనులు భార్యా భర్తలు! నీ ఆస్థాన మలంకరించు నర్తకీ గాయకులు. నీకు సమ్మతమా .

అక్బ :—ఇది తమ రనుగ్రహించు వరము కాని—

యోగి :—ఇది గుర్వాజ్ఞ. గురుధిక్కారము తాన్‌సేన్ చేయడు నాకు తెలుసును.

అక్బ :—ధన్యుడను.

తాన్ :—గురుదర్శనమువలన నేను ధన్యుడనే.

తానీ :—అనుమానదంష్ట్రిలనుండి వెల్వడిన ప్రేమను రుచిచూచిన నేను ధన్యురాలనే.

యోగి:— గేయం

పాడుకొనుడీ మీరు ప్రేమపూజారులై
భవ్యతమమైనట్టి ప్రణయగీతాలను!
పాటలో అనురాగ బాట పీఠముగాగ
నేటి మీ ప్రేమంబె నిష్కళంకముగాగ!
పాడుకొనుడీ మీరు ప్రేమపూజారులై
భవ్యతమమైనట్టి ప్రణయగీతాలను!
సతిపత్నులై మీరు భారత చరిత్రలో
నుతిగాంచెదరు గాక సరిలేని రీతిగా!
పాడుకొనుడీ మీరు ప్రేమపూజారులై
భవ్యతమమైనట్టి ప్రణయగీతాలను!
మీ గానమే మాకు మేటిఆహారంబు
మీ ఆటలే మాకు మేటసమ్మోదంబు
మీమూర్తులే మాకు మిగుల మోదావహము!
మీ దాంపతుల ముదమె మాజాతిఖ్యాతి!
పాడుకొనుడీ మీరు ప్రేమపూజారులై
భవ్యతమైనట్టి ప్రణయగీతాలను.

(తెర వాలును)

△

# తాన్ సేన్

## దృశ్యము పదకొండు

అక్బరు దర్బారు.

(ఆస్థానగాయకుడు, విద్యానందుడు విచిత్రాకారములతో భాధింప బడి కొనిరాబడుదురు)

అక్బ :—మీరెవరు ?

భటులు :—వీరు ఆస్థానగాయకులు. వీరు తాన్ సేను గురువులు. విద్యానందులట.

అక్బ :—ఇట్టిమార్పునకు గారణము ?

భటుడు :—సంగీతములో గల పటిమను చూపించి తాన్ సేన్ ప్రభు ప్రక్కన్న ఘనులని అనిపించుకొనుటకు కొంపలంటించి కత్తులలో పొడిపించి, పర్వతశిఖరములనుండి పడద్రోసి, నదీజలముల ముంచి జననష్టముకల్గించిరి. మరణదండన కర్హులని మంత్రుల యభిమతము.

అక్బ :—ఇది సంతోషసమయము. వీనిని బంధవిముక్తుల గావించి సత్కరింపుడు.

(తానీ తాన్ సేనులు ప్రవేశించెదరు)

అక్బ :— పూజ్యవర్యా ! ఆ సింహాసనము నలంకరింపుడు ; తానీ నీ నృత్యము చూచి చాలదినములైనది.

తానీ : —తాన్ సేన్ వైపు చూచును)

(ఇంతలో యోగిప్రవేశించును)

తాన్ :—గురువులు అరుదెంచిరి.

అక్బ : - యోగిపుంగవులారా ! దయ చేయుడు !

తాన్ :—తానీ ! గురువులు నీ విద్యకు మెచ్చి ఆశీర్వదించు సదృష్టము పట్టినది ధన్యురాలవు !

యోగి :—శిష్యునిగానమును, అతని భార్యనృత్యము నొకపర్యాయమే తిలకించు నదృష్టము సామాన్యులకు లభ్యమగునా ?

స్వేచ్ఛ నమ్రతయొక్క—సీమనే రాజిల్లు
తాన్ సేను నిల్చిన తాని ప్రక్క—
జ్ఞానంబు, భక్తియు గలసి మోహించును
తాన్ సేను నిల్చి తాని ప్రక్క—
ధర్మంబు ప్రేమయు దాంపత్యమొందును
తాన్ సేను నిల్చిన తాని ప్రక్క—
గీతంబు, నృత్యంబు క్రీడించు నొక్కట
తాన్ సేను నిల్చిన తాని ప్రక్క—
ప్రకృతి, పరమాత్మ లొక్కట వరలుచుంద్రు
తాని తాన్ సేను ప్రేమలో తన్మయత్వ
మొంద నటువంటి యవకాశ మొదువు నేడు
తాని వర్తింపపాడ మా తానుసేను.

తాన్ :—యథాజ్ఞాపయతి గురుః !

తాన్ సేను గానముచేయ, తానీ నృత్యముచేయును.

గే య ం.

కళాశోభితము జీవితమూ
కళామయంబీ జగమూ !
కళలోమునిగి కళలో తేలే
కళాజీవులే ధన్యులూ !

కళాశోభితము జీవితమూ
కళామయంబీ జగమూ !

కులమత భేదము లేనే లేక
గుణశీలనము లేనే లేక
అనితర సౌఖ్యమూ చేకూర్చెడి
కళయగునే కద యీజగతి !

కళాశోభితము జీవితమూ
కళామయంబీ జగమూ !

నాదోపాసన జేసే ధన్యులు
నాశన మెరుగని వీరులు !
తాన్ సేన్ తానీదంపతులు
ధన్యులు — వర్ధిలుడిక మిగా !

కళాశోభితము జీవితమూ
కళామయంబీ జగమూ !

(యోగి ఆశీర్వదించుచుండ తెర వ్రాలును)

సమాప్తము.

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్‌వారి స్వకీయ
శ్రీ రాజేశ్వరి ముద్రానిలయమందు ముద్రితము, రాజమండ్రి 1947

